

MOTHER OF THE WORLD

# మిసిమి

**"All that we are is the product of what we have thought' is "We are what we think." - Dammapada.**

సంపుటి 11 ఆగష్టు 1999 సంచిక 8

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ రవీంద్రనాథ్ ఆలపాటి

## విషయసూచిక



విడిప్రతి రూ. 8/- వార్షిక చందా రూ. 100/- విదేశీయులకు $ 20

ముఖచిత్రం : **నికోలస్ రోరిక్**

Printed & Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd.,
1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7645536
e-mail : misimi_m@hotmail.com
http : //www.misimi.com

సంపాదకుడు : అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి

# ‘మిసిమి’

## ప్రత్యేక సంచిక వెలువడబోతుంది

మిసిమి వ్యవస్థాపక సంపాదకులు **డా. ఆలపాటి రవీంద్రనాథ్** జన్మదినాన్ని (నవంబరు 4వతేదీ) పురస్కరించుకొని, నవంబరు, డిసెంబరు సంచికలను కలిపి, సుమారు నూరు పుటలతో ఆధునికానంతరతావాదం మీద ప్రత్యేక సంచికగా వెలువరించ దలిచాము. అందులో సుప్రసిద్ధ పాత్రికేయ, రచయిత, చింతన, విమర్శకులైన బాలగోపాల్, వేణుగోపాల్, రామకృష్ణ, సీతారామ్, అఫ్సర్, కల్పనా కన్నాభిరాన్, సురేంద్రరాజు, ముజిబుద్దీన్, వెంకట్రావు, అలోక్ భల్లా, రవికుమార్, వెగా, వెంకటస్వామి, తిరుపతిరావు, రఘురామరాజుల వ్యాసాలు ఉంటాయి.

వీరంతా పోస్ట్ మాడర్నిజాన్ని వివిధ దృక్పథాల నుంచి తమ తమ వ్యాసాలలో దర్శిస్తారు. మనలను దర్శింప జేస్తారు.

మిసిమి చదవండి. మిత్రులతో చదివించండి చందాదారులను చేర్పించండి. మిసిమి ఆలోచనలను నలుగురికి పంచండి. మిసిమి మీనుంచి ఆశించేది ఒక మంచి మాట. అదే పదిమందికి బాట అవుతుంది.

మీ కాపీలను రిజర్వు చేసుకోండి.

# హిమాలయాత్మను వర్ణబద్ధం చేసిన
# నికోలస్ రోరిక్

– చలసాని ప్రసాదరావు

సూర్యోదయాస్తమయ సమయాల్లో రజత-స్వర్ణ కాంతులీనే గిరిశిఖర సమాహారం మహోజ్వలంగా దృశ్యమానమయే హిమాలయాల సన్నిధిలో తన్మయులు కాని వారుండరు. సందర్శకులు కళా హృదయులైతే చలించి, పులకించి పోకుండానూ ఉండలేరు

అలాంటి హిమనగ సన్నిధిలోని కులూ లోయలో స్థిరపడి కేవలం హిమాలయ దృశ్యాలనే అపురూప వర్ణ సమ్మేళనతో దాదాపు వేయికి పైగా చిన్నా, పెద్దా కళాఖండాలుగా సృష్టించిన చిత్రకారుడు నికోలస్ రోరిక్.

సాధారణ దృష్టికి సంభ్రమ పరిచే ''మంచు కొండలు''గా గోచరించే హిమాలయాలను వెయ్యి పెయింటింగ్స్‌గా చిత్రించి కూడా దేనికదే ఒక విశిష్ట కళాకృతిగా ఆకట్టుకునేలా తీర్చిదిద్దటం రోరిక్ సునిశిత దృష్టికి, వర్ణవైవిధ్యతకు మాత్రమే సాధ్యమనిపించే ప్రత్యేక లక్షణం. టాగోర్ నుండి ఐన్‌స్టీన్ దాకా అసంఖ్యాకులు ఆచిత్ర సంచయ సందర్శనతో ముగ్ధులైపోవడానికి కారణం ఆ రంగుల అపురూప సమ్మేళనమే 'రోరిక్ బ్లూ' అనేది మరెవరికీ సాధ్యంగాని, రోరిక్ చిత్రాల్లోనే కనుపించే ఒక విశిష్ట వర్ణం. దాన్నాయన ఉపయోగించుకున్న రీతి ఆ ప్రఖ్యాతిని తెచ్చిపెట్టిందాయనకు.

రోరిక్ పెయింటింగ్స్‌లో అందరూ వాడే రంగులే అపురూపంగా జీవం పోసుకుంటాయి హిమశిఖరాలపై సూర్య కిరణాలు పడి ధవళకాంతులూ, స్వర్ణ కాంతులూ చిమ్మే సమయాన్నాయన చిత్రించిన తీరును స్వయంగా చూసిన ఒక కళా జీవి వర్ణన ప్రకారం .. . సాయం సంధ్యలో ఆ పెయింటింగ్ ఒకటి ఉన్న రోరిక్ స్టుడియో గదిలోని దీపాన్నార్పివేసి, కిటికీలు, ద్వారాలు అన్నీమూసివేయగా, ఆ చీకట్లో కూడా పెయింటింగ్‌లోని హిమశిఖరం ఉజ్వలంగా వెలిగిపోతూ కనుపించిందట!

ఇది ఒక కళాకారుని అద్భుత వర్ణ పరిజ్ఞానానికి, వర్ణ లేపనా నైపుణ్యానికి పరాకాష్ట!

నికోలస్ రోరిక్ పుట్టి, పెరిగింది సుప్రసిద్ధ రష్యన్ నగరం సెంట్ పీటర్స్ బర్గ్‌లో, 1874లో!

ఆ కుటుంబం వేసవిలోనూ, వసంతంలోనూ తమ 3000 ఎకరాల ఎస్టేట్‌లో గడుపుతూ ఉండేవారు. ఆ ఎస్టేట్ పేరు ''ఈశ్వర'' అందులోనున్న నివాస భవంతి ముందు గదిలోగల ఒక పెయింటింగ్ రోరిక్‌ను అమితంగా ఆకట్టుకునేది. అందులో చిత్రితమైనది మెరిసే మంచు కొండలే. చాలా కాలం తర్వాత మాత్రమే ఆ పెయింటింగ్‌లోని దృశ్యం భారతదేశపు డార్జిలింగ్ నుండి దృశ్యమానమయే ''కాంచనగంగ'' అని తెలిసి వచ్చింది రోరిక్‌కు. ఆ విధంగా రోరిక్‌లో భారతదేశం, అక్కడి హిమాలయాల పట్ల ప్రత్యేకాసక్తి, ఆకర్షణ ఆనాడే పెంపొందాయి.

రోరిక్ తండ్రికి ఆ ఎస్టేట్‌ను అమ్మిన రష్యన్ గతంలో భారతదేశంలో పర్యటించి వచ్చిన వ్యక్తి. కనకనే ఆ ఎస్టేట్‌కు రష్యన్లకు అపరిచితంగా ధ్వనించే ''ఈశ్వర'' అనే పేరు పెట్టాడు. ''కాంచన గంగ'' చిత్రం అతనా పర్యటనలో సేకరించినదే.

అ విధంగా రోరిక్ భవిష్యత్‌లో ఆ హిమాలయ దృశ్యాలతోనే వేయికి పైగా అద్భుత చిత్రాలను రూపొందించే మహత్తర సృజన - వర్ణ శైలి గా రూపొందటానికి బీజం వేసిన వాడయ్యాడాయన.

ఈ వేయి హిమాలయ చిత్రాలూ, ఆరు వేల ఇతర చిత్రాలూ గాక, మరో వేయిదాకా ఓపెరాలకు స్టేజి, డ్రెస్ డిజైన్స్ వంటివి చిత్రించాడాయనా తర్వాతి కాలంలో. సుదీర్ఘ యాత్రా పర్యటనల సమయంలో సైతం ఎక్కడికక్కడ ఆయా ప్రకృతి దృశ్యాల్ని కాన్వాస్‌కెక్కించేవాడు. అందువల్లనే రోరిక్ చిత్రాల్లోని చిత్రితాంశం హిమాలయాలైనా, గోబి ఎడారులైనా,- టిబెట్ పీఠభూములైనా, కులూ లోయలయినా వైవిధ్య భరితంగా రూపొందేవి. ప్రకృతిలోని రంగులు రోరిక్ రంగుల్లో సమ్మిళితమైపోయేవి

రోరిక్ ఒక నిరంతరాన్వేషి. ఒక రకంగా దేశ దిమ్మరి. రష్యన్ విప్లవానికి ముందే ఆదేశం వదిలేడు. తన ప్రగాఢ వాంఛ అయిన హిమాలయ సన్నిధిలో స్థిరపడేలోగా....

తన పద్దెనిమిదవ ఏట తన అభీష్ట ప్రకారం చిత్రకళలోను, తండ్రి కోరిక ప్రకారం న్యాయశాస్త్రంలోను ప్రవేశ పరీక్షలకు వెళ్ళి ప్యాసయేడు. మొదట 'లా' లో చేరినా, అభిరుచి లేని ఆ రంగంలో కొనసాగలేక, మధ్యలోనే వదిలేసి, చిత్రకళకే అంకితమవుతూ ఫైనార్ట్స్ కాలేజీలో ప్రవేశించేడు.

1912లో తన 38వ ఏట విఖ్యాతమైన పీటర్స్ బర్గ్ ఓపెరాకు స్టేజి, సెట్స్, దుస్తులు, ఆహార్యం ద్వారా డిజైన్ చేసే స్థాయిని సాధించుకున్నాడు.

ఈ దశలో రోరిక్ వేసిన పెయింటింగ్స్‌లోని చిత్రితాంశాలు ఎక్కువగా చారిత్ర కాంశాలూ, ప్రకృతి దృశ్యాలూ, జనపద చిత్రణలే అయినా, ఆనాటికే ఆయన రంగులు విశిష్టపద్ధతిలో కొట్టవచ్చినట్లూ, ఆకర్షణీయంగానూ కనుపించేవి. రవిగాంచనివి కవిగాంచునుగదా... అన్నట్లుండేవా రంగుల పొందికలు.

ఈ ప్రత్యేకత వల్లనే మరో ఎనిమిదేళ్ళ కల్లా అమెరికాలోని చికాగో ఆర్ట్ ఇన్‌స్టిట్యూట్ ఆహ్వానం అందుకుని, వందలాది పెయింటింగ్స్‌తో బయల్దేరి అక్టోబర్ 3వ తేదీన న్యూయార్క్‌లో ఓడ దిగేడు. చికాగోలో రోరిక్ చిత్రకళా ప్రదర్శన అఖండ విజయం పొందటంతో ఆ ఎగ్జిబిషన్‌ను తర్వాత అనేక అమెరికన్ ముఖ్యనగరాలలోనూ ఏర్పాటుచేసేరు. ఒక రష్యన్ చిత్రకారుని కళాకృతులు అంతపెద్ద ఎత్తున ప్రదర్శింపబడటం అమెరికాలో అదే ప్రథమం.

ఈ ఊపులోనే చికాగో ఓపెరా వారూ రోరిక్‌ను ఆహ్వానించి ''స్నోమైడెన్'' అనే తమ ప్రోగ్రాం తాలూకు యావత్ డిజైనింగ్‌నూ రోరిక్‌కు అప్పగించేరు.

ఆ తర్వాతి కాలంలో అమెరికాలోనే పూర్తిగా రోరిక్ చిత్రాలతో ఒక మహాభవంతి మొత్తం ''రోరిక్ మ్యూజియం''గా రూపుదిద్దుకుందంటే ఆయన కళాసృష్టిఎంత నిర్విరామంగా, నిర్దుష్టంగా, విశిష్టంగా కొనసాగిందో ఊహించవచ్చు. రష్యాలో, ఫ్రాన్స్‌లో మరికొన్ని చోట్ల కూడా ప్రత్యేకంగా రోరిక్ చిత్రాలతో మ్యూజియంలు ఉన్నాయి.

1923లో నవంబర్ 17న తొలిసారిగా భారతదేశంలో, బొంబాయి రేవులో ఓడదిగాడు రోరిక్ తన అయిదు పదుల జీవితాన్వేషణానంతరం. ఈ దేశంలోని హిమాలయాలు ఆయన మదిలో నాటుకునున్న రంగుల కలలు. ఆ కలల లోయలు, శిఖరాలు, మేఘచ్ఛాయల గుండా నాలుగేళ్లపాటు 1924 నుండి 1928 దాకా మధ్య ఆశియాలో సకుటుంబంగా పర్యటించే డాయన. 15,500 మైళ్ల ఈ సుదీర్ఘయాత్రలో కనీసం 35 ప్రపంచంలోకెల్లా ఎత్తయిన కనుమల గుండా వారు పయనించేరు. కష్టాలకూ, నష్టాలకూ కూడా వెరువని ఈ సుదీర్ఘాన్వేషణ 1928 మే 26న డార్జిలింగ్‌కు తిరిగి రావటంతో పూర్తయింది.

''ఎందుకు?....'' అనే ప్రశ్నకు అర్థం లేదు. రోరిక్ చిత్రకారుడే గాదు, తాత్వికుడూ, చారిత్రక పరిశోధకుడూ, పురావస్తు శాస్త్రజ్ఞుడూ, అన్వేషకుడూ, అన్నీనూ. తర్వాతి కాలంలో ప్రాచీన కళాఖండాలు, కట్టడాల పరిరక్షణోద్యమం ప్రారంభించి యుద్ధాల కాలంలో వాటి జోలికెవరూ వెళ్లకుండా ఉండేలా ప్రపంచదేశాల మధ్య ఒక ఆచరణాత్మక చట్టాన్ని ఆమోదింపజేసేడు. అదే ''రోరిక్ ప్యాక్ట్''గా సుప్రసిద్ధం. ఈ కారణాల వలననే టాగోర్, నెహ్రూ వంటి కళా జీవులూ, రాజకీయ వేత్తలూ కూడా రోరిక్ అభిమానులయేరు. ఆయన స్థిరపడిన కులూవాలీ ఎందరెందరికో యాత్రాస్థల మయింది. భారతదేశానికి స్వాతంత్ర్య ప్రకటన జరిగిన మరి నాలుగు మాసాలకు 1947 డిశంబర్‌లో తన 73వ ఏట మరణించేవరకూ రోరిక్ కులూలోయనే తన స్థిరనివాసంగా ఏర్పాటు చేసుకుని, తన కార్యకలాపాలనూ, కళా సృజననూ అక్కడి నుండే కొనసాగించాడు.

నికోలస్ రోరిక్ ఇద్దరు కొడుకుల్లో ఒకరైన స్వెతస్లావ్ రోరిక్ తండ్రికి తగిన వారసునిలా అదే స్థాయిలో చిత్రకారునిగా తన ప్రతిభను ప్రదర్శించేడు. తొలి భారతీయ సినీతారగా సుప్రసిద్ధురాలైన దేవికారాణిని వివాహమాడేడు. తండ్రి మరణానంతరం బెంగుళూరులో సువిశాలమైన శాండల్ ఉడ్ ఎస్టేట్‌లో తండ్రి సేకరించిన పురావస్తు సంపదను, మ్యూజియంలకు, మిత్రులకు పోగా మిగిలిన పెయింటింగ్స్‌నూ పరిరక్షిస్తూ, తన కళాకృషిని కొనసాగిస్తూ అంతిమ యాత్ర వరకూ అక్కడే గడిపేడు.

నికోలస్ రోరిక్ ఒక అద్భుతచిత్రకారుడే గాదు, అపురూప వ్యక్తి కూడా. హిమాలయాల్ని ప్రేమించటమే గాదు, వాటి అందాల్ని, ఔన్నత్యాన్ని తన చిత్రాల్లో వర్ణబద్ధం చేసేడు. సామాన్యులేగాదు, ''రవి గాంచలేనివి కూడా'' కవి కంటితో చూసి, చిత్రకారుని హృదయంతోఅనుభూతి చెంది అజరామరం చేసేడు. చరిత్రలో శాశ్వతంగా నిలిచిపోయేడు.

**ఆఖరి మాట :** దశాబ్దాలక్రితం విశ్వాంతరాళంలోకి దూసుకుపోయిన తొలి అంతరిక్ష యాత్రికుడు యూరీ గగారిన్‌ను పత్రికలవారు ''విశ్వాంతరాళం ఎలా ఉంది?'' అని ప్రశ్నించగా, అతనిచ్చిన సమాధానం.

''రోరిక్ పెయింటింగ్స్ లా ఉంది'' అని!

ఆయన చిత్రాల్నింకేం వర్ణించగలం

# అందంకోసం.. అగ్రులు చాస్తే....

## (సైకాలజీ)

- మిసిమి వర్క్ షాపు

బహుశ మానవుడు ప్రాదుర్భావం చెంది, తనను గురించిన ఎరుక ఆరంభమైన నాటి నుంచి అంటే, మానవుడు Self conscious అయిన నాటి నుంచి, తను ఇతరుల కంటె భిన్నం అని ఎరిగిన నాటినుంచి, ఇతరులతో సంబంధాలు నెలకొలుపుకోవడానికి ప్రయత్నించాడు. ఈ సంబంధాలు సజావుగా ఉండాలని గూడా ఆలోచించాడు. అంటే ఈ సంబంధాల ద్వారా తాను ఇతరులను, ఇతరులు తనను ప్రభావితం చేస్తారని తెలుసుకొన్నాడు. ఇలా ప్రభావితం చేసుకోవడం ద్వారా తన 'ఉద్ధతి' ని ప్రత్యేకతను ప్రదర్శించాలను కొన్నాడు. అక్కడ నుంచే మనిషి తనను ఇతరులు గుర్తించి తీరాలి, (craving for self recognition) అనే తహ తహ అతనిలో బలీయమైంది. ఈ 'ఆత్మికగుర్తింపు' తహతహ ఆత్మాభివ్యక్తీకరణ (self expression) కు దారితీసింది.

ఆత్మాభివ్యక్తీకరణలో భాష, ఇతర అంశాలతో పాటు, అందం గూడ ఒక కారకంగా గుర్తింపబడింది. ఈ అందం రెండు రకాలుగా ఉండవచ్చు. ఆంతరిక సౌందర్యం, బాహ్య సౌందర్యం.

ఆంతరిక సౌందర్యం వ్యక్తి ఆలోచనలకు, దృక్పథాలకు, వాటిని వ్యక్తం చేసే తీరుకు సంబంధించింది. బుద్ధ మైత్రి ఆంతరంగికాలోచనకు అందాన్నిస్తుంది. బుద్ధ మైత్రి అంటే, ప్రేమైక-కరుణ Loving Kindness. అంతేగాదు అందులో మృదుభాషణం గూడ ఉంది. ఇటువంటి అంతర్గత మూర్తిమత్వం ఎంతో అందంగా ఉంటుంది. ఇది ఇతరులను తనవైపుకు ఆకర్షిస్తుంది.

రెండో రకం సౌందర్యం బాహ్యమైంది. అంటే దేహానికి సంబంధించింది. దేహాకృతి బాగుంటే ఎవరైనా ఇట్టే ఆకర్షితులవుతారు. దేహాకృతి ఎలా ఉంటే బాగుంటుందని మనంగిరి గీసి చెప్పలేక పోయినా, ఒక మనిషిని చూసి ఆమె అందంగా ఉందో లేదో ఎవరైనా చెప్పగలుగుతారు. అందం చాల వరకు ఆయా జాతుల, దేశాల సంస్కృతిని బట్టి ఉంటుంది. బానడొక్క, దొడ్డి కాళ్ళను ఏ సంస్కృతీ అందంగా ఉంటాయని చెప్పదు.

ఆధునిక ప్రపంచంలో ఆంతరంగిక సౌందర్యం కంటే దేహాకృతి సౌందర్యానికి పల్లకీ పడుతున్నారు. ప్రకృతిలో సహజంగా పులకితమయ్యే పూలు వాటి సౌరభాలు నిజంగా ఎటువంటి వానికైనా మరులు కొలుపుతాయి, మత్తెక్కిస్తాయి. ఇవ్వాళ ఆధునిక నాగరికత బాహ్య సాంకేతిక ప్రకృతిలో విరిసే ఈ వాసన లేని రంగు రంగుల పూల వెంట జనం గంగవెర్రులెత్తి పరుగులు తీస్తున్నారు. సాంకేతిక విజ్ఞానం బాహ్యరూపాన్నే మార్చి వేసింది. రంగుల సినిమాలు, పత్రికలలో రంగుల్లో స్త్రీలతో అడ్వర్టైజ్ మెంట్లు, ఇళ్ళు అన్నీ రంగుల బొమ్మరిళ్లు - అంతా వాసన లేని, అసహజమైన రంగుల మయం. అంతేకాదు సినిమాల్లో అందమైన నాయికా నాయకులు, వ్యాపార ప్రకటనలకు పోజులిచ్చే రకరకాల మోడల్స్. వీళ్ళ రంగులు అందానికి నేడు నిర్వచనాలు చెబుతున్నాయి. ప్రతి స్త్రీ పురుషుడు, సినిమా, టి.వి. పత్రికలలోని నాయికా నాయకులను, మోడళ్ళను ప్రామాణికంగా తీసుకొని వారిని ఆదర్శంగా

పెట్టుకొని తాము అంత అందంగా లేమే అని వాపోతున్నారు. కొంతమంది నిజంగా వారికంటె అందమైన వారు ఉండవచ్చు. అయితే ఎక్కువమంది తామంత అందంగా లేమని భావిస్తున్నారు.

ఫలితంగా జరిగిందేమంటే నాయికానాయకుల మోడళ్ల ఎత్తు పల్లాలు ఒడ్డు పొడవులు, నాసిక, కనుబొమల తీరు, నుదురు, పెదవులు, పలువరుస తమకు లేవే అని ప్రతి అంశంలో పోల్చి చూసుకొంటున్నారు. ఇలా పోల్చి చూసుకోవడంతో ప్రతి ఒక్కరు ''దేహ చేతనులు'' బాడీ కాన్షస్ అయ్యారు.

దేహాకృతికి ప్రాముఖ్యం ఇస్తున్నారు. బాడీ కాన్షస్ పెరగడంతో, తాము మోడళ్ళంత అందంగా లేమని భావించిన చాలమందిలో తమ శరీరాలపై తమకే ఒక న్యూనతా భావన ఏర్పడింది. దీనిని వారు ఏర్పరుచుకొన్న ''నకారాత్మక దేహ ప్రతిమ''గా అంటే నెగటివ్ బాడీ ఇమేజ్‌గా చెప్పవచ్చు.

ఇది చాలమందిలో జబ్బుగా మారింది. దీనితో సతమతమయ్యే వారు గంటల తరబడి అద్దం ముందు కూర్చొంటున్నారు. సౌందర్యశాలలకు, బ్యూటీ పార్లలర్లకు వెళ్తున్నారు. కాస్మెటిక్ సర్జరీ, అందం కోసం శస్త్ర, చికిత్స చేయించుకొంటున్నారు. తమ దారుణ, ఘోర, తిరస్కృత, వెగటు పుట్టించే దేహ ప్రతిమను గంటలకొలది పరిశీలించుకొంటూ, ఎక్కడ లోపం ఉందో, ఏ భాగం సరిచేయించుకోవాలో అనే ఆలోచనలతో సతమతమవుతున్నారు.

అమెరికాలో, ఇప్పుడు మనదేశంలో గూడ సౌందర్య శస్త్ర చికిత్సలు ప్రాచుర్యంలోకి వచ్చాయి. కొవ్వు ఎక్కువగా ఉన్నచోట్ల తగ్గించి, లేని చోట పెట్టడం లాంటి liposuction surgery, స్తనాలను అందంగా ఉండడానికి ఎంతవరకు అవసరమో అంతవరకు పెంచడం, తగ్గించడం, ముక్కును సరిచేయడం లాంటి శాస్త్రచికిత్సలు వచ్చాయి. ముక్కును సరిచేయించుకోవడం అంటే మనకొక విషయం గుర్తుకు వస్తుంది. ప్రెసిడెంట్ జాన్ ఫిట్జ్‌రాల్డ్ కెనెడీ భార్య అప్పటి అమెరికా ప్రథమ మహిళ ముక్కు చలా అందంగా ఉందని భావించి, అమెరికాలో చాల మంది ఆడవాళ్ళు అప్పట్లో ఆమె ముక్కును బోలిన ముక్కును పెట్టించుకొన్నారు. ఆమె ముక్కు నిజంగా అందమైందో, లేదా ప్రథమ మహిళ అయినందు వల్ల ఆమె ముక్కు అందంగా కనిపించిందో తెలియదు. ఇహ ఆ విషయాన్ని అలా వదిలేస్తే అనేక అవయవాలను అందంగా మార్చే శస్త్ర ప్రక్రియలు వచ్చాయి.

ఈ సౌందర్యలాలస ఎక్కువై, 'నకారాత్మక దేహప్రతిమ' ప్రబలమైనప్పుడు, అతడు లేదా అమె మానసికంగా కుంగిపోతారు. ఇది మూర్తిమత్వ సమస్యలలో, పర్సనాలిటీ ప్రాబ్లమ్స్‌లో ఒకటై మనిషి ప్రవర్తనను మార్చివేస్తుంది.

ఈ శారీరక అసంతృప్తి, కాల్పనిక లోపభూయిష్ట దేహాకృతి అనేక ఖాదన ( తినడం) అపవ్యవస్థలకు దారి తీస్తుందని మనో విజ్ఞాన శాస్త్రవేత్తలు చెబుతున్నారు. ఈ అపవ్యవస్థను ఆకలి లేమి నాడీ రుగ్మత (Anorexia nervosa) అంటారు. ఇది ప్రాణాంతకమైన జబ్బు. తనకుతాను తెచ్చిపెట్టుకొన్న జబ్బు. అన్నం అతనికి సహించదు. క్రమీణ చిక్కి శల్యమై మరణిస్తాడు.

లావవుతున్నామనుకొని భీతిల్లే యువతులను ఈ వ్యాధి ఎక్కువగా బాధిస్తుంది. వారు లావు తగ్గినా కూడా, బాగా విపరీతంగా సన్న బడిన తరువాత గూడ, వారు ఇంకా తమలో కొవ్వు అధికంగా ఉందనే భావిస్తారు.

ఇంతకు ముందు చెప్పిన వ్యాధికి వ్యతిరేకమైంది అతి ఆకలి నాడీరుగ్మత, బ్యూలీమియ నెర్వోసా (Bulimia Nervosa). ఈ వ్యాధి సంక్రమించిన వారికి తమ తిండిపై ఏమాత్రం అదుపు ఉండదు. వారిని ''తిను తిను'' అనే ఒకరకమైన ఆలోచన వారి మనస్సును ముట్టడిస్తుంది. ఈ ముట్టడి నుంచి వారు బయట పడలేరు. ఇది వారికి ఆత్మ వినాశకర పరిస్థితి.

ఖాదనలాలస. దీనిని Binge - eating అంటారు. అంటే వారికి తిన్నకొందికి సంతోషమనిపిస్తుంది. ఈ వ్యాధిలో తినాలనే ఒత్తిడి, బరువెక్కుతామనే భీతి అపవ్యవస్థలుంటాయి. ఇవి నకారాత్మక దేహ ప్రతిమకు, ఆత్మగౌరవం క్రమశః సన్నగిల్లడానికి దారి తీస్తాయి.

ఈ విధంగా 'నకారాత్మక దేహ ప్రతిమ' పాదుకొంటే, పై ఖాదన వ్యాధులేకాక, ఏకధృవ అవసాదం అంటే యూనిపోలార్ డిప్రెషన్ గూడ ఆవహిస్తుంది. ఒకసారి ఈ విధంగా అవసాదంలోపడి పోయిన వారు, కుంగిపోయిన వారు, తమ ప్రతిమలను ఆకృతులను ఉన్నవాటిని ఉన్నట్లుగా చూడలేక, వక్రదృష్టితో చూస్తారు. తమను తాము ద్వేషించుకొంటారు. తాము అల్పులమని, ఎందుకూ కొరగాని వారమని భావిస్తూ, అపరాధ భావనలకు లోనవుతారు. ఇంకా వీరు అన్హెడొనియతో అంటే జీవిత మాధుర్యాన్ని ఆస్వాదించలేని అశక్తతతో బాధితులవుతారు. అంటే వీరికి జీవితం నిస్సారంగా తోస్తుంది. వారి తీవ్రమైన నిరాశ, నిస్సహాయత ఆలోచనలు వారి మనస్సులలో పరుగులు తీస్తాయి. కొంతమందైతే ఆత్మహత్యా ప్రవృత్తులను గూడ పెంపొందించుకోవచ్చు. ఇంత వరకు నకారాత్మక దేహ ప్రతిమ ఎలా ఏర్పడుతుందో, దానివలన సంక్రమించే మానసిక వ్యాధులేమిటో క్లుప్తంగా వివరించడం జరిగింది. మరి ఈ నకారాత్మక ప్రతిమా భావన నుంచి బయట పడడమెలా?

1) మొట్ట మొదటగా 'అందం' అనేది సాపేక్షమేకాని కేవలం కాదనేది గుర్తించాలి. అందాన్ని కొలిచే కొలబద్ద ఏదీలేదు. కొంతమందికి మనుషులు సన్నగా ఉంటేనచ్చుతారు. కొంతమందికి కొంచెం లావుగా, మరీ విపరీతమైన లావు కాకుండ, కొంచెం గుండ్రంగా ఉంటే నచ్చుతారు. ఎవరికి ఏది అందంగా కనిపిస్తుందనేది, వారి వారి సంస్కారాల మీద, సంస్కృతి మీద, శిక్షణ మీద ఆధారపడి ఉంటుందనేది గమనించాలి. అందరికీ అదే వస్తువు అంత అందంగా కనిపించకపోవచ్చు.

2) మనో విజ్ఞానశాస్త్ర జ్ఞానం కొంతవరకు సహాయ పడవచ్చు.

3) దేహప్రతిమ వ్రేలిముద్రలంత స్పష్టమైంది. దానిని గురించి డైరీ రాసుకొంటే అతనికి అదేమిటో స్పష్టంగా తెలుస్తుంది.

4) దేహ ప్రతిమ సంబంధ వ్యాకులతను శరీరాన్ని మనస్సును విశ్రాంతంగా అంటే రిలాక్స్ చేయడం ద్వారా సరిచేయవచ్చు. ఆ తరువాత దేహ ప్రతిమకు విచేతనుడు (desensitization) కావడం అంటే క్రమక్రమంగా దానిని గురించి పట్టించుకోక పోవడం, క్రమంగా మరిచిపోవడం.

5) అసలు ''నకారాత్మక ప్రతిమ'' మనస్సులో రూపు దిద్దుకొన్నది తనలోతాను వైయక్తింగా మాటాడుకొన్న సంభాషణల కారణంగానే. ఈ ''ఆంతరంగిక సంభాషణం'' ''ఇన్నర్ కన్వర్సేషన్'' స్థానంలో తనకు తాను నచ్చ చెప్పుకొనే ''ఆత్మ భాషణం'' కు (సెల్ఫ్‌టాక్స్‌కు) చోటివ్వాలి.

6) ఆత్మపరాజయ అంటే సెల్ఫ్ డిఫీటింగ్ ప్రవర్తనను మార్చుకొని ఇతరులతో సంతోషకరమైన సంబంధాలను నెలకొలుపుకోవాలి.

7) నకారాత్మక ప్రతిమ నుంచి కొంతవరకు ఒడ్డునబడ్డ తరవాత, మళ్ళీ ఆ గత శైలులు తిరిగి రావడానికివీలైన మనలోని బలహీన ద్వారాలను మూసివేయాలి. తత్సంబంధమైన గత జీవన శైలిని పూర్తిగా పరిహరించి దానిని ఎట్టి పరిస్థితులలోను మనస్సులోకి రానీయరాదు. ఒకసారి నడిచిన బాట గనుక దానికి తిరిగి రావడం తేలిక.

8) క్రియాశీలంగా, నిండుగా, పూర్తిగా జీవితంలో పాల్గొని లీనమవుతూ దినదినం జరిగే ప్రగతిని గమనిస్తూ ఉండాలి.

దేహ ప్రతిమ సమస్య ఆకలి లేమి నాడీ రుగ్మతగా ప్రత్యక్షమవుతుంది దీనికి అనేక కారణాలున్నాయి తన లోపానికి తానే పేరు పెట్టుకొని, దానికి ఆ పేరు రాసిన చీటిని అంటించుకోవడం వల్ల - ఉదాహరణకు నా తొడలు కొవ్వుబట్టి లావుగా ఉన్నాయి అని ముద్రవేసుకోవడం వల్ల - అతని మీద ఆకలి చంపుకొనే ఒత్తిడి విపరీతమవుతుంది. ఇది అతని జీవితంలో అన్ని సమస్యల కంటె ప్రబలమైన స్థానాన్ని ఆక్రమిస్తుంది. ఈ అవసాదంతో ఆకలి దప్పులు ఇంకి, ఎండిపోతాయి. ఆహారమూ- శరీరం మీద దాని స్వభావం- లో పడిపోతాడు. దీనికి కారణం ఎక్కడ ఉంది? ''ఆకృతి చైతన్యం'' లేదా ప్రతిమా చైతన్యం అంటే ''షేప్ కాన్షస్'' సమాజం ఈ ''మృత్యువాంఛ'' (death wish)కు ప్రేరణను కల్పిస్తుంది సమాజం కనుక రూపలావణ్యాన్ని, దేహాకృతి అందాన్ని నెత్తిన పెట్టుకొని పూజించకపోతే ఇటువంటి అనర్థం దాపురించేది కాదు.

అవసాద జ్ఞాన సిద్ధాంతం - కాగ్నిటివ్ థీయరీ ఆఫ్ డిప్రెషన్ - ప్రకారం మూడు రకాల జ్ఞాన వక్రతలకు అంటే విషయాలను యథాతథంగా చూడకుండా వంకరగా చూడడం - దారితీస్తుంది. మొదటిది ఆత్మవక్రత అంటే తనను తాను తిన్నగా చూసుకోలేక పోవడం. రెండోది ప్రపంచాన్నీ తిన్నగా చూడలేడు. మూడోది భవిష్యత్తునూ అంతే చూస్తాడు. అతి ఆకలి, ఆకలి లేమి జబ్బులతో బాధితులయ్యే అనేక మంది రోగులను చూసినప్పుడు తమ దేహాకృతికి, బరువుకు సంబంధించిన వారి అహేతుక విశ్వాసాలు, జ్ఞాన విరూపణలే కారణమని అర్థమవుతుంది. ఈ రోగులు ఏర్పరుచుకొనే తమ ఆత్మ ప్రతిమ సెల్ఫ్ ఇమేజ్, వారు తమ దేహాకృతి, బరువులు గురించి ఏమనుకొంటున్నారో దాని మీద ఆధారపడి ఉందని తేలింది.

రసాయనిక శాస్త్ర పరంగా చూస్తే, అటువంటి రోగుల శరీరాలలో నొరొపైన్ ఫ్రైన్ (Nore Pine Phrine) సెరెటోనిన్‌లు (Serotonin) చాల తక్కువగా ఉన్నాయి. ట్రైప్టోఫాన్ (Tryptophon) గూడ తక్కువగానే ఉంది. చిత్తవృత్తిని మార్చివేసే ప్రోటీన్లు, కార్బొహైడ్రేట్‌లను ఎక్కువగా తీసుకొంటే, ఈ ఖాదన అపవ్యవస్థలను సరిచేయవచ్చు.

మనో రోగ చికిత్స విషయాలను వక్రంగా చూడడం మీద, దేహ ప్రతిమ సమస్యల మీద, వ్యక్తి లోనయ్యే బాహ్య, అంతర ఒత్తిడుల మీద తన దృష్టిని కేంద్రీకరిస్తుంది. రోగి సహకారంతో, బరువును కోల్పోవడం అంటే అర్థం ఏమిటి? అతడు ఏర్పరుచుకొన్న దేహ ప్రతిమ ఎటువంటిది - అనే విషయాలను సైకొథెరపి పరిశోధిస్తుంది.

ఖాదన అవ్యవస్థలను అంటే అతిగా, అల్పంగా తినడానికి సంబంధించిన సమస్యలను చాలవరకు స్వయం చేతనత్వంతో అంటే Self Monitoring తో సరిదిద్దుకోవచ్చు స్వయం చేతనత అంటే మనం అనుభవించే అనుభవాలను వెంటనే అంటే అవ్యవహితంగా సచేతనంగా అంటే జాగరూకులమై చూస్తూ ఉండడం అంటే మనకు అనుభవం కలుగుతున్నప్పుడే, కలుగుతున్న దానిని కలుగుతున్నట్లుగానే పరిశీలిస్తూ ఉండడం. వాస్తవంగా అంతరంగంలో ఏమి జరుగుతోంది. శరీరం బాహ్యంగా ఏమి జరుగుతోంది పరిశీలించడం. మన A-B-C క్రమం ఉపయోగించి దేహ ప్రతిమ డైరీని తయారు చేసుకోవచ్చు

A. అంటే య్యాక్టివేటర్స్ (క్రియా కారకాలు· నిన్ను గురించి, నీ శరీరం గురించి ఏ ఏ సంఘటనలు నకారాత్మక అంటే వ్యతిరేక భావనలను, అనుభూతులను కలిగిస్తున్నాయి?

B ఆలోచనలు, నమ్మకాలు: ఏ ఏ ఆలోచనలు నమ్మకాలు, విశ్వాసాలు ఆ సమయంలో నీ మనస్సులో ఉన్నాయి?

C. ఫలితాలు· ఆవిధంగా నీ మనస్సులో నడుస్తున్నదానికి నీవు ఔద్వేగికంగా ఎలా ప్రతిస్పందిస్తున్నావు? వాటిని నీప్రవర్తనలో ఏ విధంగా అభివ్యక్తం చేస్తున్నావు?

స్వయం చేతన విధానాలకు మరికొన్ని ఉపాయాలను కలపవచ్చు. వీటిని TIDE టెక్నిక్స్ అంటారు

T అంటే Types of emotins అంటే నీవు ఏరకం ఉద్వేగాలకు గురి అవుతున్నావు? కుంగిపోతున్నావా? వ్యాకులత చెందావా? కోపం వచ్చిందా? జుగుప్సా ఏది

I. అంటే ఆ ఇంటెన్సిటీ, - అంటే ఆ ఉద్వేగాల తీవ్రత

D. disturbance of the emotins ఆ ఉద్వేగాలు కలిగించే అల్లకల్లోలత.

E effects of the emotins ఆ ఉద్వేగాల ఫలితాలు

ఈ రెండు ఉపాయాలను అంటే ABC, TIDE లను కలుపుకొని డైరీ తయారు చేసుకొని, ఆత్మ ప్రతిమ, దేహ ప్రతిమ - ఈ రెండింటి లోతులకు వెళ్ళి ఎవరైనా అంతర్దృష్టి పొందవచ్చు. ఒకసారి అంతర్దృష్టి కలిగిన తరవాత అతడు తనను తాను ఎంతగానో సంస్కరించుకోగలుగుతాడు, నకారాత్మక ప్రతిమలను పరిష్కరించుకోవచ్చు.

క్రమబద్ధ విచేతనీకరణం అంటే Systematic desensitization అనే మరో ఉపాయాన్ని గూడ దేహ ప్రతిమ సమస్యతో బాధితులైనవారు ఉపయోగించవచ్చు - వారి విషయంలో ఇది చాల బాగా పని చేసింది కూడ. శరీరంలో ఏ ఏ భాగాలు ఎక్కువ కలతగావిస్తున్నాయో జాబితా రాసుకొని, పైనుంచి క్రిందికి, క్రిందినుంచి పైకి పోతూ గమనిస్తుంటే, క్రమంగా ఎక్కువ కలత కలిగించే వాటికి సచేతనుడు కావడం మానివేస్తాడు

ఉదాహరణకు బాగా కలత పెట్టేవి - పిరుదులు, తొడలు, ఆ తరవాతవి - పొట్ట, పళ్ళు అన్నింటి కంటె తక్కువ కలత పెట్టేది జుట్టు అనుకోండి. ఈ లిస్టును పై నుండి క్రిందికి, క్రిందినుంచి పైకి మననం చేస్తుంటే, క్రమంగా ఎక్కువ కలత పెట్టే వాటికి అతడు విచేతనీ కరణం చెందుతాడు. ఇదే అద్దంలో చూసుకొంటూ గూడ చేయవచ్చు.

# ''రచన ఏకాంత జీవితం''

*(1954 నోబెల్ బహుమతి పురస్కారస్వీకరోపన్యాసం )*

మూలం : **ఎర్నెస్ట్ మిలర్ హెమింగ్వే** అనువాదం : **బి. రామిరెడి**

''మానవుడు మరణం కోసం సృష్టించ బడలేదు. ఒక మనిషిని మనం నాశం చేయవచ్చునేమో కాని, అతనిని ఓడించ లేము''

- The Old Man and the Sea.

''కథా కథనశైలి మీద ఆయన సాధించిన పట్టుకు, ముఖ్యంగా ' ది ఓల్డ్ మేన్ అండ్ ది సీ' లో ఆ పట్టును ప్రదర్శించినందుకు నోబెల్ బహుమానం ఇవ్వడమైంది'' అని సైటేషన్‌లో పేర్కొన్నారు అతనిశైలి, అతని సంతకం (la style la man) . ఈ వాక్యం అక్షరాల హెమింగ్వే విషయంలో నిజం. ఆయన శైలి గురించి హారీ లెవిన్ ఇలా అన్నారు: ''ఆయన తన రాతను ఏకరేఖీయ తలానికి (linear plane) పరిమితం చేస్తారు. పక్క దారులు పట్టించకుండ, నిర్మితి సంబంధమైన సంక్లిష్టతల జోలికి పోకుండా ఒకే దిశలో తన రేఖా శుద్ధతను నడుపుతుంటారు. ఒక దాని తరువాత ఒకదానిని, అంటే అనుక్రామికంగా ప్రతిమలను నడుపుతాడు. ప్రతి ప్రతిమ కొద్ది కాలం మాత్రమే ఉంటుంది. ఆ ఉన్నంత సేపు పాఠకుని అచంచల శ్రద్ధను ఆకట్టుకొంటుంది. ఈ విధంగా ప్రతిమలను నడపడం ద్వారా తనదైన ప్రత్యేక ద్రవీభూతమైన స్వచ్ఛతను సాధిస్తారు.''

★ ★ ★ ★

అంతకు ముందెన్నడూ కనీ వినీ ఎరుగని రీతిలో ఇరవయ్యో శతాబ్దిని సాహితీ పరంగా అత్యంతంగా ప్రభావితం చేసిన ఎర్నెస్ట్ మిలర్ హెమింగ్వేకిమొన్న జూలై21 తో నూరేళ్ళు నిండాయి.

- సంపాదకులు

ఉపన్యసించే అవకాశం లేనందువల్ల, ఉపన్యాసకుణ్ణి కానందువల్ల, నోబెల్ పురస్కార ప్రదాతల వదాన్యతకు నమోవాకాలర్పిస్తున్నాను

ఇతర గొప్ప రచయితలకు కాక తనకే ఇలాంటి గొప్ప పురస్కారం లభిస్తున్నప్పుడు నమ్రతతో దాన్ని స్వీకరించడమే విజ్ఞత. ఇతరగొప్ప రచయితల లిస్టు తయారుచేయవలసిన అవసరమేమీలేదు, ఎందుకంటే, అలాంటి లిస్టులో ఎవరి విజ్ఞతని, అంతరాత్మని బట్టి పేర్లు చేర్చబడతాయి.

మాదేశపు రాయబారిద్వారా పురస్కారాన్ని స్వీకరిస్తున్నాను కాబట్టి నా హృదయంలో ఉన్న విషయాలన్నింటినీ ఉపన్యాసంద్వారా మీముందుంచడం సాధ్యంకాదు. రచయితకి వెంటనే తను చెప్పవలసిన విషయాలను చెప్పడం సాధ్యంకాదు. రచన అనేది కాలాంతరంలో రూపుదిద్దుకునే ఒకపరిణామం.

రచన అనేది ఏకాంత జీవితం. అది సంఘటిత కృషివల్ల సాధ్యమయ్యేది కాదు. లోకంలో కీర్తి, గుర్తింపూ పొందిన కొద్దీ రచయిత యొక్క రచన దిగజారిపోతూ ఉంటుంది. కారణం, రచన

ఏకాంతంలో రూపుదిద్దుకుంటుంది. మంచి రచయిత నిత్యమూ శాశ్వతత్వాన్ని గాని, లేదా లేకపోవడాన్నిగాని ఎదుర్కోవాలి

నిజమైన రచయితకు ప్రతిరచనా ఒక సరికొత్త ప్రారంభమే ప్రతి రచనలోను అలాంటిరచయిత అసాధ్యమైన వాటిని సాధించేందుకు ప్రయత్నిస్తాడు. అనితరసాధ్యాలను సుసాధ్యం చేసుకునేందుకే రచయిత ఎల్లప్పుడూ ప్రయత్నించాలి అలాంటప్పుడే అదృష్టవశాత్తూ అతడు విజయాన్ని సాధించగలుగుతాడు. ఎప్పుడూ గతంలోంచి ముందుకు ఒంటరిగా సాగిపోయి, ఎవరి సహాయమూ అందని పరిస్థితుల్లోంచి మన గొప్ప రచయితలందరూ ఉద్భవించారు.

ఒక రచయిత మాట్లాడవలసిన దానికంటె ఎక్కువగా మాట్లాడాను. రచయిత తను చెప్పవలసిన వాటిని వ్రాయాలి కాని చెప్పకూడదు మరొకమారు మీకు ధన్యవాదాలు చెప్పుకుంటున్నాను.

ఈ అంగీకారోపన్యాసాన్ని చదవడానికి ముందు. H S. నైబెర్గ్ అనే స్వీడిష్ అకాడెమీ సభ్యుడు తన అభిప్రాయాన్ని ఈవిధంగా తెలియజేశారు:

ఈ సంవత్సరపు నోబెల్ సాహితీ పురస్కార గ్రహీత అయిన ఎర్నెస్ట్ హెమింగ్వే తన అనారోగ్యకారణాలవల్ల స్వయంగా ఈ ఆనంద సమయంలో ఇక్కడికి రాలేకపోయినందుకు విచారిస్తున్నాను. డేగ కళ్ళతో ప్రపంచాన్ని పరిశీలించి, మన యుగానికి సంబంధించిన గందరగోళ పరిస్థితుల్ని, అలాంటి పరిస్థితులమీద పోరాటాన్ని సాగిస్తున్న మానవుడి సంఘర్షణని ఖచ్చితంగా అనుసంధించి వివరించినందుకుగాను రచయితకు మనకృతజ్ఞతను, అభివాదాన్ని తెలియజేయాలనుకుంటున్నాను రచయిత వివరించిన మానవ సమస్యలు మనందరికీ వర్తిస్తాయి. అవి మన ఆధునిక జీవన పరిస్థితులకు సంబంధించినవి. అదికొద్దిమంది రచయితలు మాత్రమే సమకాలీనసాహిత్యంమీద అలాంటి విస్తృతమైన ప్రభావాన్ని చూపగలిగారు. త్వరగా కొలుకుని రచయిత తన జీవన సాఫల్యతను సాధిస్తాడని ఆశిద్దాం.

★ ★ ★ ★

మన ఆధునికయుగంలో అమెరికన్ రచయితల సాహిత్యం మీద గట్టిముద్రవేశారు. గతకొన్ని దశాబ్దాలుగా వారు మన మేధోపరిధుల్ని విస్తృత పరుస్తున్నారు. ఈ కొత్త అమెరికన్ రచయితల పేర్లు మనకు చిరపంచితం అవడమే కాకుండా వారు తమ అమెరికన్ తాత్త్విక నేపద్యాన్ని ప్రపంచానికి చాటుతున్నారు. వారికి యూరోప్ నమస్కరిస్తోంది. అమెరికన్ రచయితలు అమెరికన్లలాగా వ్రాయాలని, అంతర్జాతీయ సాహితీరంగానికి తమవంతు సేవ చేయాలని అందరూ కోరు కుంటున్నారు.

అలాంటి ప్రముఖ అమెరికన్ రచయితల్లో ఒకరైన ఎర్నెస్ట్ హెమింగ్వే ఇతర అమెరికన్ రచయితలకన్నా ఎనల్ని అమెరికన్ సాహిత్యానికి ఎక్కువ సన్నిహితుల్ని చేశారనడంలో అతిశయోక్తి లేదు.

సాహిత్యకారునిగా హెమింగ్వే జీవితంలో నాటకీయమైన మలుపులెన్నో ఉన్నాయి. తన యుగానికి చెందిన నిరాశావాదమూ, గందరగోళాలకి దూరంగా హెమింగ్వే సాహిత్యం పయనిస్తుంది. హెమింగ్వే తన్షైలిని జర్నలిజంలోంచి శ్రమపడి సాధించుకున్నాడు. కెన్సాస్ సిటీ వార్త పత్రిక ఆఫీసులో పనిచేసిన అనుభవంలోంచి, చిన్న చిన్న వాక్యాల, చిన్న పేరాల నిర్మాణశైలిని నిర్మించుకున్నాడు. క్రమ శిక్షణతో కూడిన అతని శైలిలోని కళాత్మక శక్తి రహస్యం అదే. శైలి విషయంలో హెమింగ్వే గురువు మార్క్ ట్వేన్. మార్క్ ట్వేన్ ''హక్లెబెర్రీఫిన్'' లోని సూటియైన, సరికొత్తకథాకథన విధానంలోని లయాత్మకతా ప్రభావం హెమింగ్వే మీద ఉంది.

ఇలినాయ్‌కి చెందిన ఈ యువ జర్నలిస్టు మొదటి ప్రపంచ యుద్ధంలో ఇటలీలో అంబులెన్స్ డ్రైవర్‌గా పనిచేశాడు. ఆయుద్ధంలో గాయపడ్డాడు. 19సంవత్సరాల వయస్సులోని ఈ భయంకరమైన యుద్ధానుభవం అతని జీవితంలోని అతిముఖ్యమైన సంఘటన. ఈ అనుభవం అతని స్థైర్యాన్ని దెబ్బతీయకపోగా, టాల్‌స్టాయికిలాగా, యుద్ధానుభవాన్ని ముఖాముఖిగా పొంది, దాన్ని గురించిన నిజాలను ఉన్నదున్నట్లుగా వర్ణించే వీలుకలిగింది. 1918 లో జరిగిన అతని జీవితంలోని ఈ అనుభవం చాలా సంవత్సరాల తరువాత కళాత్మక రుపాన్ని తీసుకుని 1929లో ''ఏ ఫేర్‌వెల్ టు ఆమ్స్'' గా రూపుదిద్దు కుంది. ఈ నవల హెమింగ్వేలోని కథా కథన శక్తిని నిరూపించింది దీని తరువాత యూరోపియన్ పోస్ట్‌వార్ పరిస్థితులతో రచించిన నవల '' ఇన్ అవర్ టైమ్ (1942),'' ''ది సన్ ఆల్సో రైజస్'' (1926) నవల కథాకథనంలో హెమింగ్వే గొప్పతనాన్ని ప్రపంచానికి చాటాయి ఈ నవలలతో హెమింగ్వేకి రచయితగా గొప్పకీర్తి ప్రతిష్ఠలు వచ్చాయి

తరువాత సంవత్సరాల్లో అతను ఆఫ్రికాలోని వేటలు, స్పెయిన్‌లోని బుల్‌ఫైట్స్ మీద రచనలు చేశాడు. తరువాత స్పెయిన్‌లో అంతర్యుద్ధం రావడంతో 1940లో తన రెండవ ప్రసిద్ధ నవల ''ఫర్ హూమ్ ది బెల్ టోల్స్'' రచించాడు. ఈ నవలలో అమెరికన్ స్వాతంత్ర్యపిపాసి వ్యక్తి ఆత్మ గౌరవం కోసం యుద్ధం చేయడాన్ని అభివర్ణించాడు. ఈ నవలలో హెమింగ్వే వ్యక్తిగత భావాలు అతని ఇతర నవలలలో కంటే ప్రస్ఫుటంగా కనిపిస్తాయి.

హెమింగ్వేశైలిని ప్రతిఫలించడంలో అతని మినీ కథలు నవలలకి ఏమాత్రం తీసిపోవు. సంక్షిప్తత, ఆప్తత ఈ కథల కథనశైలిలోని ప్రత్యేకత. అతని కథలన్నిటికీ మణికిరీటం 1952లో రచించిన ''ది ఓల్డ్ మాన్ అండ్ ది సీ''. ఇందులో హెమింగ్వే మరుపురాని ఒక క్యూబన్ ముసలివాణ్ణి, అతడు అట్లాంటిక్ మహా సముద్రంలో వేటాడి పట్టుకున్న పెద్ద సొరచేపతో అతని యుద్ధాన్ని వర్ణించాడు. ఈ కథలో రచయిత మానవుడి యొక్క అంతిమ గమ్యాన్ని గురించి సందేశమిస్తాడు. ఈకథ మానవుడు తన ఓటమిలో కూడా నీతిపరంగా విజయం సాధించగలడని సందేశమిస్తుంది, మనిషి ఓటమి కోసం సృజించ బడలేదు. మనిషి నాశనమైనా అతడు అజేయుడు.

హెమింగ్వే మొదటి రచనల్లో రాక్షసత్వం, నిరాశ, మందకొడితనం అక్కడక్కడా కనుపించినా అతని రచనల్లో జీవితానికి సంబంధించి వీరోచితమైన సంఘర్షణ, సాహసం, అపాయం ఎడల ప్రేమ;

ప్రాపంచికాల్లో హింస, మృత్యువుల మధ్య మంచి కోసం నిత్యమూ పోరాడే మనిషియెడల అభిమానం కనిపిస్తాయి. ఇదే అతని రచనల్లో అభిమానించవలసిన గొప్ప ఆదర్శం. సాహసం హెమింగ్వే రచనలన్నింటిలోను కనిపించే ప్రధానమైన అంశం.

అంతేగాక, హెమింగ్వే తన రచనల్లో ఎక్కడా సిద్ధాంతాలు మాట్లాడడు. రచయిత ఎప్పుడూ తటస్థంగా ఉండాలనే విషయాన్ని అతడు కెన్సాస్ సిటీ వార్తా పత్రిక ఆఫీసులో పనిచేసిన రచనానుభవం నుంచి నేర్చుకున్నాడు. యుద్ధం మానవాళిమీద తిరుగులేని విషాద ఛాయల్ని చూపుతుందని తెలుసుకున్నాడు. యుద్ధాన్ని మౌనసాక్షిగా, ఎలాంటి ఉద్రేకాలకూ లోను కాకుండా వీక్షించడాన్ని అలవర్చుకున్నాడు.

సమకాలీన సాహిత్యంలో అత్యద్భుతమైన శైలీ విన్యాసాన్ని సాధించిన మహా రచయితల్లో ఒకడిగా ఇరవై అయిదు సంవత్సరాల కథా కథన కళలో అమెరికన్, యూరోపియన్ రచయితలలో గుర్తింపు పొందాడు. శైలి విషయంలో అతనొక స్థిరమైన, సులభమైన, హార్థికమైన పద్ధతిని సాధించాడు. అలాంటిశైలిని సాధించడం కష్టతరం. అతనిశైలిలో వాడుక భాషా పద విన్యాసాలు ప్రత్యేక స్థానాన్ని ఆక్రమించుకున్నాయి. అతనిశైలిలో ఎక్కడా కృతకత్వం కనిపించదు. తన రచనల్లోని పాత్రలలోని మానసిక విషయాలచర్చను అతడు పాఠకులకే వొదివేస్తాడు.

హెమింగ్వే రచనల్ని పఠించినవారికి అతని రచనల్లోని కొన్ని దృశ్యమానమైన సంఘటనలు మనసును జాజ్జ్వల్యమానం చేస్తాయి. ఉదాహరణకు ''ఫర్ హూమ్ ది బెల్ టోల్స్'' లో స్పానిష్ పర్వతాల్లోని వంతెనని పేల్చివేశాక, ఆ ప్రయత్నంలో జోర్డాన్ తన ప్రాణాల్ని అర్పించడం, వర్షంలో, బురదలో లెఫ్టినెంట్ హెన్రీ గుండెల్లో గుబగుబలాడే భయం, ''ది ఓల్డ్ మన్ అండ్ ది సీ'' నవలలో పెద్ద సొరచేపని పట్టుకుని వెనుదిరిగి వొచ్చే ప్రయత్నంలో ఆ చేపమీద షార్కు చేపలు దాడిచేసినప్పుడు హవానా హార్బర్ గుడ్డిలైట్ల వెలుతురులో ముసలివాడి ఒంటరిపోరాటం పాఠకుల మనస్సులమీద చెరిగిపోని ముద్రవేస్తాయి.

హెమింగ్వే ''ది ఓల్డ్‌మన్ అండ్ ది సీ'' నవలకూ, వంద సంవత్సరాల క్రితం మెల్‌విల్ రాసిన అమెరికన్ క్లాసిక్, ''మోబీడిక్'' నవలకూ గొప్ప పోలిక కనుపిస్తుంది. షార్కు చేపలతో ముసలివాడిలాగే ఒంటరిగా తెల్ల తిమింగలంతో పోరాడిన కెప్టెన్ అహాబ్‌కూ తిరుగులేని పోలికలున్నాయి. హెర్మన్ మెల్‌విల్‌గాని హెమింగ్వే గాని అంతగొప్ప ఎలిగరీని రచించాలని అనుకుని ఉండరు. ఈ రెండు కథలకీ కాన్వాస్ అయిన అట్లాంటిక్ మహాసముద్రం పాఠకులకు గొప్ప కవితాత్మక చర్చకు వీలు కల్పించింది. ఈ రెండు రచనల్లోను గొప్ప రోమాంటిసిజంతో బాటు రియలిజంకూడా పుష్కలంగా ఉంది. ఈ రెండు మహాకావ్యాలూ ఒకే విషయాన్ని బోధిస్తాయి- ''మనిషి సాహసానికి అపజయంలేదు. మనిషి తనకు అసాధ్యమైన వాటిని కూడా సాధించే సాహసం చేయగలడు. మనిషి ఆ ప్రయత్నంలో చనిపోవచ్చు. కాని అతని సాహసానికి అపజయంలేదు.''

పైనచెప్పినకారణాలవల్లనే ఈ సంవత్సరపు నోబెల్‌సాహితీ పురస్కారాన్ని, మనయుగానికిచెందిన మహారచయితల్లో ఒకడైన హెమింగ్వేకి, అతడు ఈయుగ గల క్షణాలను నిజాయితీగా, సాహసవంతంగా మన ముందుంచినందుకు గాను, ప్రదానం చేయాలని నిర్ణయించారు హెమింగ్వేకి ఇప్పుడు 56 సంవత్సరాలు నోబెల్ సాహితీ పురస్కారాన్ని పొందిన అమెరికన్ రచయితల్లో అయిదవవాడు. దురదృష్టవశాత్తు రచయిత అనారోగ్యకారణాలవల్ల స్వయంగా ఈ పురస్కారాన్ని స్వీకరించేందుకు రాలేకపోయినందువల్ల, అమెరికా రాయబారికి అందజేయబడుతోంది.

- ఏండర్స్ ఆస్టర్లింగ, శాశ్వత కార్యదర్శి.
స్వీడిష్ అకాడమి

**జీవిత చరిత్ర**

ఎర్నెస్ట్ హెమింగ్వే (1898 - 1961) ఇలినోయ్‌లోని ఒకపార్క్‌లో జన్మించాడు. కెన్సాస్ సిటీలోని వార్తా పత్రిక కార్యాలయంలో, పదిహేడు సంవత్సరాల వయస్సులో రచయితగా జీవితాన్ని ప్రారంభించాడు. మొదటి ప్రపంచయుద్ధంలో అమెరికా చేరకముందే ఇటాలియన్‌సైన్యంలో అంబులెన్స్ దళంలో వాలంటీర్ డ్రైవర్‌గా చేరాడు యుద్ధంలో గాయపడి చాలాకాలం ఆసుపత్రిలో ఉన్నాడు. ఇటలీ ప్రభుత్వంచేత సన్మానింపబడ్డాడు. అమెరికాకు తిరిగి వొచ్చాక కెనెడియన్, అమెరికన్ వార్తాపత్రికలకు రిపోర్టర్‌గా పనిచేశాడు గ్రీకు విప్లవ కాలంలో వార్తా సేకరణకు యూరోప్‌కు పంపబడ్డాడు.

1920 ప్రాంతంలో పారిస్‌లోని అమెరికన్‌ఎక్స్‌పార్టియేట్‌సభ్యుడిగా ఉన్నాడు. ఆ అనుభవాలతోనే 1926లో ''దిసన్ ఆల్సో రైజేస్'' అనే పుస్తకాన్ని రచించాడు. 1929లో వ్రాసిన ''ఏ ఫేర్‌వెల్ టు ఆమ్స్'' ఒక అమెరికన్ అంబులెన్స్ డ్రైవర్ యుద్ధంలో ఎదుర్కొన్న అంతర్, బహిర్ సంఘర్షణను వివర్ణించింది. స్పెయిన్‌లో రిపోర్టర్‌గా పనిచేసిన అనుభవం లోంచి హెమింగ్వే తన ప్రసిద్ధనవల ''ఫర్ హూమ్ ది బెల్ టోల్స్'' 1940లో రచించాడు. అతని తరువాతి రచనల్లో ప్రసిద్ధమైన నవలిక ''ది ఓల్డ్‌మాన్ అండ్ ది సీ'' ని 1952 లో రచించాడు ఈ నవలిక ఒక ముసలివాడు పెద్దసొర చేపతో అట్లాంటిక్ మహా సముద్రంలో చేసిన వొంటరి పోరాటాన్ని, అతని అపజయంలోని విజయాన్ని వర్ణిస్తుంది.

హెమింగ్వే స్వయంగా గొప్ప క్రీడాకారుడు. సైనికుల్ని, వేటగాళ్లని, బుల్‌ఫైటర్స్‌ని వర్ణించడం అంటే అతనికి మక్కువ. అలాంటి మామూలు మనుషుల జీవితాల్లోని సాహసం, నిజాయితీని; ఆధునిక జీవన విధానంలోని రాక్షసత్వం, సామాన్యుడిలో ఉండే ఆశను, నమ్మకాన్ని అవిధ్వంసం చేసే తీరును అతడు తన రచనల్లో వర్ణించాడు. శుద్ధమైన, సూటిగా చెప్పే అతని శైలి, సంభాషణ అతని కథానికల్లో కనబడతాయి. ''మెన్ వితౌట్ విమెన్'' (1927), '' ది ఫిఫ్త్‌కాలం అండ్ దిఫస్ట్ ఫార్టీనైన్ స్టోరీస్'' 1938, అతని కథాసంకలనాలు. హెమింగ్వే 1961లో ఇడాహోలో చనిపోయాడు.

# నేతాజీ - ఆజాద్ హింద్ ఫౌజ్

– దమ్మాలపాటి వెంకటేశ్వరరావు

స్వాతంత్ర్య సమర మహాయజ్ఞంలో తమ జీవితాలను సమిధలుగా సమర్పించిన, మహానుభావులెందరో ఉన్నారు. వారిని స్మరించుకున్నంత మాత్రానే మన శరీరం పులకరిస్తుంది. మాతృభూమి దాస్య శృంఖలాలను ఛేదించాలి, అనే ఆదర్శం వారందరికి సమానమేఅయినా, ఆ లక్ష్యసాధనకు వారవలంబించిన మార్గాలు మనకు భిన్నంగా గోచరిస్తాయి. లోకమాన్యులు, మహాత్ములు, దేశబంధులు, నేతాజీలు మొదలుగా గల, ఎందరో తమ విలక్షణ పంథాలలో తమ సర్వస్వాన్ని దేశానికి అర్పించి, భావితరాల వారికి మార్గదర్శకులయ్యారు

ఇట్టి మహనీయుల కోవలో, మనకు నేతాజీ సుభాష్ చంద్రబోసు దర్శనమిస్తాడు. నేతాజీ అనే బిరుదు ఆయనకు జర్మనీలో ఆజాద్ హింద్ ఫౌజ్‌ను నిర్మించిన సందర్భంలో లభించింది. హిట్లర్‌కు ఉన్న ఫ్యూరర్(Fuhrer) అనే బిరుదుకు ఇది సమానార్థంలో వాడబడింది. తన విశిష్ట వ్యక్తిత్వంతోను, విలక్షణ ప్రతిభా వ్యుత్పత్తులతోను, భారతీయుల హృదయాకాశంలో తనకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని ఆయన ఏర్పాటు చేసుకున్నాడు. నేతాజీ జీవితం ఒక మూర్తీభవించిన త్యాగం ఆయన దేశభక్తి ఒక అవిరళ భాగీరధీ ప్రవాహం. అయినప్పటికి ఆయన జీవితాన్ని సమగ్రంగా అర్థం చేసుకోవడానికి, దానిని స్థూలంగా నాలుగు దశలుగా విభజింపవచ్చు: 1. బాల్యం, విద్యాభ్యాసం నుండి ఐ. సి. యస్. పదవికి రాజీనామా - ఇది మొదటి దశ. 2. రాజకీయరంగ ప్రవేశం నుండి కాంగ్రెసు అధ్యక్షపదవికి రాజీనామా - ఇది రెండవదశ. 3. బ్రిటిష్ ప్రభుత్వం సి. ఐ. డి. ల కన్ను గప్పి, గృహ నిర్బంధం నుంచి తప్పించుకొని, పెషావర్, కాబూలు, మాస్కోల మీదుగా జర్మనీ చేరుకోవడం - ఇది మూడవదశ. 4. జర్మనీ నుంచి మూడున్నర మాసాలు, జలాంతర్గాములలో ప్రయాణంచేసి, సింగపూర్ చేరుకోవడం, అటు పిమ్మట ప్రాచ్య దేశాలలో ఆయన నిర్వహించిన కార్యక్రమాలు - నాల్గవదశ. అయితే ప్రస్తుత విషయానికి, మూడు నాలుగు దశలతో ఎక్కువ సంబంధం ఉంది గనుక, మిగతారెండు దశలకు సంబంధించి, విహంగావలోకనకు మాత్రమే వీలు పడుతుంది.

1897 జనవరి 23న, ప్రభావతీ జానకీనాధ బోసులకు, నవమ సంతానంగా సుభాష్ చంద్రబోసు, ఒరిస్సా రాష్ట్రంలోని కటక్‌లో జన్మించాడు. ఆరోజులలో జానకీనాధుడు ప్రఖ్యాత న్యాయవాది. బాల్యం నుండి ఆత్మాభిమానంతోను, సహజ నాయకత్వ లక్షణాలతోను, పలువురిని ఆకట్టుకున్న నేతాజీ, తన అంతిమ శ్వాస వరకు ఈ లక్షణాలను ప్రదర్శిస్తూనే వచ్చాడు. కళాశాలలో చదువుతున్న రోజులలో, భారతీయ విద్యార్థులను అవమానకరంగా మాట్లాడుతూ ఉండే, ఓటన్ అను ఒక ఆంగ్ల ఉపాధ్యాయునికి దేహశుద్ధిచేసిన సంఘటన ఆయన ఎంతటి ఆత్మాభిమానం కలిగిన వ్యక్తో ఋజువుచేస్తుంది. భావి జీవితంలో బ్రిటిష్‌వారితో జరిగిన సంఘర్షణకు ఇది ఛాయా మాత్ర సంకేతంగా మనం భావించవచ్చు. తరువాతి కాలంలో ఐ.సి. యస్. పదవికి, కాంగ్రెసు అధ్యక్షపదవికి, ఆయన సమర్పించిన రాజీనామాలు ఆయన త్యాగమయ జీవితానికి ప్రతిబింబాలు.

కాంగ్రెసు అధ్యక్షపదవికి రాజీనామా చేసిన అనంతరం, నేతాజీ జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులను, సమీక్షించడం ప్రారంభించాడు. ప్రపంచమంతటా యుద్ధమేఘాలు అలముకోవడం ఆయన గమనించాడు ఏ క్షణంలోనైనా యుద్ధం ప్రారంభం కావచ్చునన్న అభిప్రాయం సర్వత్రా వ్యాపించింది. రవి అస్తమించని సామ్రాజ్యాధిపత్యం వహిస్తున్న బ్రిటన్, ఈ యుద్ధంలో తప్పక పాల్గొనవలసి వస్తుందని, ఆయనకు తెలుసు. ఈ అవకాశాన్ని ఉపయోగించుకొని, బ్రిటన్ యుద్ధంలో

నిమగ్నమయినప్పుడే, భారతీయులు కూడ, దానితో యుద్ధం చేసే స్థితికి చేరుకోవాలని, ఆయన అభిప్రాయపడ్డాడు. సత్యాగ్రహాల మీద, నిష్క్రియ ప్రతిఘటనా పద్ధతుల మీద ఆయనకు ఎంతమాత్రం విశ్వాసంలేదు. 'వజ్రం వజ్రేనభిద్యతే' వజ్రాన్ని వజ్రంతోనే ఛేదించాలి అనే సిద్ధాంతాన్ని నమ్మినవాడు కనుక, శత్రువును జయించడానికి, ఏవైపు నుంచి సహాయం వచ్చినా స్వీకరించాలి, అని ఆయన వాదించేవాడు 'శత్రువుకు శత్రువు మనకు మిత్రుడు' అన్న సిద్ధాంతం మీద, ఆయనకు పూర్తి నమ్మకం ఉండేది అందుకే ఆయన తన లక్ష్యాన్ని సాధించడానికి దేశాన్ని వదలివెళ్లి, ఫాసిస్టు నియంతలైన, ముస్సోలినీ, హిట్లర్‌లతో మైత్రి నెలకొల్పాడు. గృహ నిర్బంధం నుండి బ్రిటిష్‌గూఢచారుల కండ్లుకప్పి, మౌల్వీవేషంలో పెషావర్, కాబూలు, మాస్కోల మీదుగా బెర్లిన్ చేరుకోవడం, నేతాజీ జీవితంలో ఒక సాహసయాత్ర అయితే, అది భారత యువకులను, ఉత్తేజ పరచగలిగిన ఒక వీరగాథ అవుతుంది.

మాస్కోలో ఆర్లాండో మజోటో అనే పేరుతో, నేతాజీకి ఇటలీ దేశపు ప్యాస్ పోర్ట్ లభించింది. ఈ విధంగా 1941 మార్చి 28న, ఆయన బెర్లిన్ నగరంలో ప్రవేశించాడు. బెర్లిన్ చేరిన నాటి నుండి సుభాష్ చంద్రుడు తన లక్ష్యసాధనకు మార్గాలను అన్వేషింపసాగాడు భారతదేశానికిగల సంపూర్ణ స్వాతంత్ర్యపు హక్కును, హిట్లర్, ముస్సోలినీలచేత గుర్తింపజేయడం, అందులో మొదటిది. మొదట్లో నాజీ అధికారులు, కొన్ని నెలలపాటు నేతాజీ చేత తమ షరతులను అంగీకరింపజేయడానికి ఎంతో ప్రయత్నించారు. నేతాజీ వంటి దేశభక్తుడు అంగీకరించే షరతులు కాకపోవడంతో ఆయన వాటిని తిరస్కరించాడు. ఈ విధంగా ఆరు మాసాలపాటు ఎన్నో కష్టనష్టాలకు ఓర్చి, పట్టుదలతో, ఒక్క స్వాతంత్ర్యానికి సంబంధించిన ప్రకటన తప్ప, తాను అనుకున్నవన్నిటినీ ఆయన సాధించాడు హిట్లర్ స్వయంగా, ఆయన కోర్కెలన్నింటికీ ఆమోదం తెలిపాడు. ఆయనకు ఒక రాజ్యాధినేత హోదాకల్పించి, దౌత్యాధికారికి లభించే అన్ని సౌకర్యాలు కలుగజేశాడు. నాజీ నియంత గుర్తింపుతో, నేతాజీ తలపెట్టిన పనులన్నిటికీ త్వరత్వరగా ఆమోదం లభించడం మొదలుపెట్టింది. దీనితో స్వతంత్ర భారత కేంద్రం, ఆజాద్ హింద్ రేడియో, ఆజాద్ హింద్ ఫౌజ్ స్థాపనకు, మార్గం సుగమం చేయబడింది. వీటి నిర్వహణకు కావలసిన ఖర్చు మొత్తాన్ని, జర్మనీ బోసు ఉద్యమానికి అందజేసి, జాతీయ ఋణంగా పరిగణించడం జరిగింది. ఈ ఋణాన్ని, బోసు తనలక్ష్యాన్ని సాధించినప్పుడు, జర్మనీకి తిరిగి చెల్లించవలసి ఉంటుంది. ఇకపోతే అక్షరాజ్యాలు ( జర్మనీ - ఇటలీ - జపాను) భారత స్వాతంత్రాన్ని గుర్తించుతూ, చేయవలసిన ప్రకటనకు సంబంధించిన, విషయం మిగిలిపోయింది. ఇటలీ, జర్మనీలు ఈ మేరకు బహిరంగ ప్రకటన చేయడానికి, అంగీకరించకపోయినప్పటికి, బోసు తన లక్ష్యాన్ని సాధించడానికి, చేసే ప్రయత్నాలన్నిటికి, ఆదేశాల సహాయ సహకారాలు ఉంటాయని, హామీ ఇవ్వడం జరిగింది. అనంతరం స్వతంత్ర భారతకేంద్రం, ఆజాద్‌హింద్‌రేడియో పనిచేయడం ప్రారంభించాయి. మొదట్లో ఆజాద్‌హింద్‌రేడియోకు 45 నిమిషాలు కేటాయించగా, రాను రాను దానిని మూడు గంటలకు పెంచడం జరిగింది.

ఆజాద్‌హింద్‌ఫౌజ్‌స్థాపన విషయంలో నేతాజీ మొదట్లో ఎక్కువ అవరోధాలు ఎదుర్కోవలసి వచ్చింది. భారతజాతీయ సైన్యాన్ని తయారుచేయాలనే సంకల్పం ఆయనకు మొదటినుండి ఉండేది. ఈ ఆలోచన భారతదేశంలో కార్య రూపం ధరించడానికి వీలులేదనే విషయం అందరికీ తెలిసిందే. జర్మనీలో ఉండగా ఆయనలో ఒక ఆలోచనా తరంగం పైకిలేచింది. ఆఫ్రికా యుద్ధరంగంలో పట్టుబడిన, భారతీయ యుద్ధఖైదీలు, పదివేల మంది దాకా, దగ్గరలోనున్న అనాబర్గ్ తదితర స్థావరాలలో ఉన్నారు.

సుశిక్షిత శరీరపాటవం గలిగిన భారతీయ నౌజవాన్లు, ఖైదీ స్థావరాలలో మగ్గిపోవడం నేతాజీకి ఏమాత్రం ఇష్టం లేదు వీరితో కొద్దిపాటి జాతీయ సైన్యాన్ని ఎందుకు తయారుచేయగూడదనే సంకల్పం నేతాజీకి కలిగింది వెంటనే ఇందుకు సంబంధించిన ప్రతిపాదనలు, జర్మన్ విదేశాంగ కార్యాలయానికి పంపడం, వారు అందుకు తమ అంగీకారాన్ని తెల్పడం జరిగింది ప్రారంభంలో 15 మంది మాత్రమే ఈ దళంలో చేరారు. అయితే ఒక సంవత్సరంలోపల వీరి సంఖ్య 3500లకు పెరిగింది వీరికి అధునాతనమైన సైనిక శిక్షణ లభించింది ఈ ఫౌజ్‌ను, భారతదేశంలో, బ్రిటిష్ సైన్యంతో పోరాడటానికి తప్ప, మరే యుద్ధరంగంలో ఉపయోగించగూడదని, కచ్చితమైన నిబంధన ఉంది

జర్మనీలో తాను నిర్వహించవలసిన పనిని విజయవంతంగా పూర్తిచేసుకొని, భారతదేశానికి చేరువలో నుండవలెనన్న తలంపుతో, దూర ప్రాచ్యానికి వెళ్లాలని నేతాజీ నిర్ణయించుకున్నాడు. ఈలోపు సింగపూరు, బర్మా దేశాలు జపాను అధీనంలోకి వచ్చాయి ఈ నిర్ణయానికి జర్మనీ జపాను ప్రభుత్వాలు అంగీకరించాయి జర్మనీ నేతాజీకి సహాయం చేయడానికి అంగీకరించిన పద్ధతిలోనే, జపాను కూడ సహాయం అందించడానికి అంగీకరించింది. వెంటనే ప్రమాదభరితమైనప్పటికీ, జలాంతర్గాములలో మూడున్నర మాసాలు ప్రయాణం చేసి, నేతాజీ సింగపూరు చేరుకున్నాడు.

1943 అక్టోబర్ 21న, సింగపూరులో భారతీయుల సమావేశం జరిగింది తూర్పు ఆసియా దేశాలలో నివసిస్తున్న, 30 లక్షల మంది భారతీయులచేత ఎన్నుకొనబడిన, అయిదువేల మంది ప్రతినిధులు, రాస బిహారీ ఘోష్ అధ్యక్షతన, నేతాజీకి స్వాగతం పలికి, ఆయనను వేదికమీదికి ఆహ్వానించారు. ఈ సమావేశంలో ఆజాద్ హింద్ ప్రభుత్వాన్ని స్థాపిస్తున్నట్లు నేతాజీ ప్రకటించారు ఈ ప్రభుత్వాన్ని వెంటనే అక్షరాజ్యాలతో సహా, ఎనిమిది రాజ్యాలు గుర్తించాయి. సింగపూరు, బర్మాయుద్ధరంగాలలో పట్టుబడిన యుద్ధఖైదీలను, ఆజాద్ హింద్ ఫౌజ్‌లో చేరడానికి జపాను ప్రభుత్వం అనుమతించింది. ఈవిధంగా ఫౌజ్ సంఖ్య ఒకటిన్నర లక్షలకు పెరిగింది. ఇదిగాక ఝాన్సీ లక్ష్మి దళం పేరుతో, ఫౌజ్‌లో ఒక స్త్రీల విభాగాన్ని క్యాప్టెన్ లక్ష్మినాయకత్వాన ఏర్పాటు చేయడం జరిగింది

ఈ విధంగా సర్వసన్నద్ధమైన ఆజాద్ హింద్ ఫౌజ్‌కు 'జైహింద్, చలో ఢిల్లీ' అనే నినాదాలతో, ముందుకు సాగడానికి 1944 ఫిబ్రవరి 4న, నేతాజీ అనుజ్ఞలభించింది. భారత దేశంలో ప్రవేశించనున్న సైన్యాన్ని, నాలుగు బ్రిగేడ్లుగా విభజించి వాటికి సుభాష్, గాంధీ , ఆజాద్, నెహ్రూల పేర్లు పెట్టడం జరిగింది. సుభాష్ బ్రిగేడ్, కెప్టెన్ షానవాజ్‌ఖాన్ నాయకత్వాన పురోగమించి, కోహిమా, టిడ్డిమ్, కాలాంగ్ మొదలగు ప్రదేశములను బ్రిటిష్‌వారి నుండి విముక్తిచేసింది. ఈ విధంగా మాతృదేశంలో ప్రవేశించినమొదటి విముక్తి సైన్యం సుభాష్ బ్రిగేడ్. కాని అనంతరపరిణామాలు, ఫౌజ్‌కు అనుకూలంగా లేవు. విమానసహాయం చేయడానికి వాగ్దానం చేసిన, జపాను ప్రభుత్వం స్వయంగా యుద్ధంలో లొంగిపోవడంతో, ఆవాగ్దానాన్ని నిలబెట్టుకోలేకపోయింది. దీనికితోడు బ్రిటిష్ బాంబుల వర్షాన్ని తట్టుకునే శక్తి ఫౌజ్‌కు లేకుండాపోయింది. ఓటమిని అంగీకరించే స్వభావం నేతాజీకి ఎన్నడూ లేదు ఆయన ఎప్పుడూ ఆశావాదే. తన లక్ష్యానికి, మరో కేంద్రాన్ని అన్వేషించే ప్రయత్నంలో, ఆగస్టు 23న ఆయన ఒక విమాన ప్రమాదంలో మరణించినట్లు, జపాను వార్తా సంస్థ ప్రకటించింది ఈ వార్త నిజానిజాలపై ఇప్పటికీ సందేహాలున్నాయి ఈ విధంగా నేతాజీ, ఆజాద్ హింద్ ఫౌజ్ సాహసగాథకు తెరపడింది.

(ఆకాశవాణి విజయవాడవారి సౌజన్యంతో)

# పిల్లలకు హక్కులున్నాయి! కానీ ...?

– ఎన్. ఇన్నయ్య

ప్రపంచ స్థాయిలో గొప్ప మార్పు వచ్చింది. 21 శతాబ్దానికి అది శుభసూచకం కాని ఆ మార్పు దేశాలకు, అందులో ప్రజలకూ, ముఖ్యంగా తల్లి దండ్రులకూ చేరాలి అక్కడే వుంది తిరకాసు.

పదేళ్ళ క్రితం ఐక్యరాజ్య సమితి గొప్ప పని చేసింది. పిల్లల హక్కులపై ప్రపంచ రాజ్యాల సమావేశం జరిపింది. బాగా పరిశీలించి, చర్చించి పిల్లల హక్కుల పత్రాన్ని రూపొందించారు. 54 ఆర్టికల్స్‌తో కూడిన పిల్లల హక్కుల్ని త్వర త్వరగా అన్ని దేశాలు ఆమోదించడం మరీ విశేషం. రెండే రెండు దేశాలు యింకా సరే అనవలసివుంది ఒకటి సోమాలియా. అక్కడ ఒక ప్రభుత్వం అంటూ లేకుండా భీభత్స పరిస్థితి వుంది గనుక కొంత వేచివుండాల్సిందే. రెండో దేశం అమెరికా సంయుక్త రాష్ట్రాలు! అదీ ఆశ్చర్యకరమైన విషయం అగ్ర రాజ్యంగా, పెద్ద ప్రజాస్వామిక స్వేచ్ఛా దేశంగా గర్వించే అమెరికా పిల్లల హక్కుల్ని ఎందుకు ఆమోదించలేదు? పరిశీలించాలి.

పిల్లల హక్కుల్ని 192 దేశాలు ఆమోదించడం, చరిత్ర ఇక మిగిలింది ఆయా దేశాల పార్లమెంటులు తగిన చట్టాలు చేయడం తరువాత తల్లి దండ్రులకు త్వరగా యీ హక్కుల విషయం తెలియపరచి అమలుజరిగేటట్లు చూడడం. అక్కడే వుంది కీలకం అంతా.

పిల్లల హక్కులు ఏమి చెబుతున్నాయి?

తల్లిదండ్రులు ప్రధానపాత్ర వహించి పిల్లల హక్కుల్ని కాపాడాలి.

ఏమిటాహక్కులు? పిల్లల్ని హింసకు, దోపిడీకి, చాకిరీలకు, అమ్మకాలకు, అపహరణలకు దూరంగా వుంచాలి.

ఆడపిల్లలు, మగపిల్లలు అనే విచక్షణ చూపకుండా-సమానంగా పెంచాలి.

తగిన పోషకాహారం యివ్వాలి ఉచిత నిర్బంధ ప్రాధమిక విద్య చెప్పించాలి.

తగిన ఆరోగ్య సంరక్షణ చేయాలి

స్వేచ్ఛగా పిల్లలు తమ భావాలు, అభిప్రాయాలు వెల్లడించే వీలు కల్పించాలి

పిల్లలు విశ్రాంతిగా ఆడుతూ పాడుతూ కళలు, సంస్కృతి వికసింప జేసుకునే వీలు వుండాలి

చదవడానికీ, వినడానికీ బాగా వున్నాయి. అందుకు అభ్యంతరం ఏముంది అని వెంటనే అనేస్తారు. అమలు పరచడంలో అడుగడుగునా చిక్కులున్నాయి!

పిల్లలకు హక్కులున్నాయనే సంగతి తల్లి దండ్రులకు నచ్చ జెప్పడంలో గొప్ప యిబ్బంది వుంది. మా పిల్లలు, మా యిష్టం, ఏమైనా చేసుకుంటాం, కొడతాం, తిడతాం, పెడతాం, పనిచేయిస్తాం మా

యిష్టం వచ్చినట్లు పెంచడం పట్టిస్తాం అని తల్లి దండ్రులు అంటారు. మా పిల్లల్ని మా యిష్టం వచ్చినట్లు పెంచుకునే హక్కు లేదా అంటారు.

తల్లిదండ్రులకు నెమ్మదిగా నచ్చ జెప్పడంలోనే పిల్లల హక్కుల సమస్య ఎదురౌతుంది.

పుట్టిన దగ్గరనుండి చనిపోయే వరకూ పరోక్షంగా, ప్రత్యక్షంగా అదుపు చేసే మతం వుంది. తల్లి దండ్రులు మత విశ్వాసంతో పెరిగి, అదే మంచిదనుకొని, తమ పిల్లలకూ తమ నమ్మకాలు, విశ్వాసాలు అంటగడతారు. పేరు పెట్టడం నుండి అనేక క్రతువులు, మతపరంగా సాగిస్తారు. ఇందులో పురోహితులు కీలక పాత్ర వహిస్తారు.

తల్లిదండ్రులు ఏ మతానికి, కులానికి, జాతికి, దేశానికి చెందిన వారైతే, అవే పిల్లలకు వంశపారం పర్య ఆస్తిగా అందిస్తారు. కనుక హిందువులు, ముస్లింలు, క్రైస్తవులు, బౌద్ధులు, యూదులు కొనసాగుతున్నారు. అలాగే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, కమ్మ, రెడ్డి, కాపు, మాల, మాదిగ కులాలు పిల్లలకు అంటుకుంటున్నాయి. ఇక్కడే పిల్లలకు స్వేచ్ఛ అవసరం, అదే కష్టమైన పని.

కొన్ని విషయాలు పెద్దల పరిధిలోనివి. సెక్స్, రాజకీయం అందుకు ఉదాహరణలు. పిల్లలకు అవి అవగాహన కావు. అందుకే పెళ్ళికి యుక్తవయస్సు రావాలన్నారు. రాజకీయంగా ఓటు హక్కుకు 18 ఏళ్ళు వుండాలన్నారు. అందుకు తల్లి దండ్రులకు అభ్యంతరం లేదు. చిన్న పిల్లలకు ఓటు కావాలని, లైంగిక చర్య కావాలని, పెళ్ళిళ్ళు కావాలని తల్లిదండ్రులు అనడం లేదు. అలాంటిదే మరొక పరిధి వుంది. అదే మతం, భక్తి విశ్వాసాలు పెద్దలకు సంబంధించిన నమ్మకం. పిల్లలు యుక్త వయస్సు వచ్చిన తరువాత వారిష్టమొచ్చిన మతాన్ని స్వీకరిస్తారు, లేదా నిరాకరిస్తారు. ఈ లోగా వారు తమ చదువులో విషయం తెలుసుకుంటారు. మూఢంగా నమ్మమనడానికీ, బడిలో అడిగి తెలుసుకోడానికీ చాలా తేడా వుంది. అడిగి తెలుసుకోవడం, పాఠాలలో శాస్త్రీయంగా మతాన్ని, సెక్స్‌ను, రాజకీయాల్ని గ్రహించడానికీ తేడావుంది.

ఈ విషయం చాలా దుర్లభమైంది. తల్లి దండ్రుల్ని ఒప్పించడం చాలా కష్టం. చిన్నప్పుడే బలవంతంగా ముస్లింలు తమ పిల్లల్ని మసీదులకు తీసుకెళ్ళి నిర్బంధంగా కొరాన్ అంతా వల్లెవేయిస్తున్నారు. క్రైస్తవులు దేవాయాలలో బైబిల్‌నూరిపోసి పిల్లలకు సండే స్కూల్స్ ద్వారా మూఢనమ్మకాలు నూరిపోస్తున్నారు. హిందువులు తమ పిల్లల పక్షాన మొక్కుబడులు చేసి, గుండ్లు కొట్టించి, వినాయకుడికి దండాలు పెట్టిస్తున్నారు. ఈ విధంగా అన్ని మతాల వారు చిన్న పిల్లల్ని ఆయా మతాల నమ్మకాలలో ముంచి తేల్చుతున్నారు. పిల్లల స్వేచ్ఛను అరికడుతున్నారు. ప్రశ్నించి తెలుసుకునే స్వభావాన్ని అణచి పెడుతున్నారు. భక్తి పేరిట భయం ప్రవేశ పెడుతున్నారు. పాపం, నరకం, దైవం, దయ్యం అనే బూచి చూపి అన్వేషణ ఆపుతున్నారు.

చిన్న పిల్లల్ని వివిధ పనులకు వినియోగించడం మరొక చర్యగా వుంది. బడిలో చదవాల్సిన వయస్సులో పని చేయించి, వారి సంపాదన తల్లి దండ్రులు స్వీకరిస్తున్నారు. చిన్న పిల్లల్ని పరిశ్రమల్లో

వినియోగించినప్పుడు, ఆకర్మాగారాల ఉత్పత్తి స్వీకరించకూడదని కొన్ని ప్రజాస్వామిక దేశాలు ఆంక్షలు పెడుతున్నాయి. ఉదాహరణకు భారతదేశంలో చిన్న పిల్లల్ని తివాచీలు తయారు చేయడంలో, బాణాసంచా మందు సామగ్రి చేయడంలో, బీడీలు తయారు చేయడంలో వినియోగిస్తున్నారు. పిల్లల్ని తమ పెట్టుబడిగా వాడుకోవడం తల్లి దండ్రులనేరం, కనడం అదుపులో పెట్టుకోమంటే, దేవుడిచ్చిన సంతానం అని సమాధానం సాకుగా చెబుతారు. అక్కడ కూడా మతాలు అడ్డొచ్చి, జనాభా అదుపును వ్యతిరేకిస్తూ, దైవం పేరిట, పవిత్ర గ్రంధాల పేరిట ద్రోహం చేస్తున్నాయి. కాలుష్యం పెంచడంలో మతాల పాత్ర చాలా వుంది. ఈ విషయంలోనూ తల్లి దండ్రులకు నచ్చ జెప్పాల్సిందెంతో వుంది

యుద్ధాలలో చిన్న పిల్లల్ని వాడడం మరో ఘోర చర్య. ఆఫ్ఘనిస్తాన్ మొదలు సోమాలియా వరకూ యుద్ధాలలో చిన్న పిల్లల్ని వాడారు. ఇంకా వాడుతున్నారు. మతం, దైవం పేరిట పిల్లలు సైతం దేశం కోసం, నాయకుడి కోసం త్యాగం చేయాలని బోధలు చేసారు. అనేక మంది పిల్లల్ని ఆహుతి చేశారు ఈ విషయంలో ఏయే దేశాలలో ఎంతమంది పిల్లలు బలి అయిందీ సమితి వివరాలు ప్రచురించింది. అనేక చోట్ల మందు పాతర్లకు వికలాంగులు గావడం, చనిపోవడం కూడా నిరంతరం జరుగుతున్నది. మందు పాతర్లని తొలగించాలని తీర్మానించినా, ఈ ఉద్యమం కుంటుతూనే వుంది.

పిల్లలకు సైతం మతం పేరిట వైద్యం చేయకుండా, కేవలం ప్రార్థనతో చికిత్స సరిపోతుందనే నేరాలకు కొందరు పాల్పడుతున్నారు. క్రైస్తవ మత శాఖలు కనీసం 15 వరకూ యీ క్రూర చర్యను అమలు పరుస్తున్నాయి. దీనిపై అమెరికా, యూరోప్ దేశాలలో వుద్యమాలు సాగుతున్నాయి. మతహక్కు చాటున, పిల్లలకు రోగాలు వచ్చినట్లు చెప్పకుండా దాచిపెట్టి, చంపేసిన దారుణాలు వెలుగులోకి వస్తున్నాయి. క్రిస్టియన్ సైన్స్, ఫెయిత్ అసెంబ్లీ, జెహోవా విట్నెస్, క్రీస్తు అసెంబ్లీ వంటి క్రైస్తవ శాఖలు 17 వరకూ యిలాంటి చర్యలకు పాల్పడుతున్నాయి. లోగడ భారత దేశంలో చిన్నపిల్లలకు రోగాలు వస్తే, మొక్కుకోవడం, కాల్చడం వంటి పిచ్చి వైద్యాలు చేసి ఆహుతి యిచ్చినట్లే, యివి కూడా సాగుతున్నాయి. ఇలాంటివి అన్ని మతాలలోనూ వున్నాయి. మదర్ తెరీసా వంటి వారు చిన్న పిల్లలకు మందులివ్వకుండా ప్రార్థనలతో సరి పెట్టిన సందర్భాలున్నాయి!

మతం పేరిట ప్రపంచ వ్యాప్తంగా మరో ఘోరం జరుగుతున్నట్లు సమితి ఇటీవల గుర్తించింది. మతం పేరు పెట్టకుండా సాంస్కృతిక దురాచారం అన్నారు. ఆడ పిల్లలకు సుంతీ చేయించడం యిందులో ఒకటి. కొన్ని ముస్లిం దేశాలు, కొన్ని ఆఫ్రికన్ దేశాలు యీ చర్య తప్పనిసరిగా చేస్తున్నాయి. బాలికల మర్మాంగం బుడుపును కోసేస్తారు. దీనివలన వాపులు, సెప్టిక్ అయి చనిపోవడం, సెక్స్ చర్యలో తీవ్ర ప్రతి బంధకాలు ఏర్పడుతున్నాయి. యునెస్కో వారు, యీ చర్య జరిగినచోట ప్రథమ చికిత్స కిట్స్ యిస్తున్నారు. అమెరికాలోని ముస్లింలు సైతం విదేశాలకు వెళ్ళి తమ ఆడపిల్లలకు సుంతీ చేయించుకొస్తున్నారు అమెరికాలో ఆడ పిల్లల సుంతీ నిషిద్ధం గనుక అలా చేస్తున్నారు.

ప్రపంచ మతాల సభను సమితి ఏర్పాటు చేసింది పిల్లల విషయంలో జాగ్రత్త వహిస్తామని ఆయా మత ప్రతినిధులు అన్నారు. కాని మూల పవిత్రగ్రంధాలను ప్రశ్నించకుండా, మత మూల పురుషుల పెత్తనం తొలగించకుండా వున్నంత కాలం, పిల్లలపై అత్యాచారాలు, దూషణలు ఆపడం సాధ్యంకాదు మతాలే పిల్లల హక్కుల్ని అమలు పరచ నివ్వడం లేదు. మత గ్రంథాలలో పిల్లల్ని హింసించడాన్ని ఆమోదించారు. పిల్లల్ని బానిసలుగా చూడడాన్ని బైబిల్ ఆమోదించింది అలాంటి మతాలు పిల్లల హక్కుల్ని అమలు పరచవు.

పిల్లల్ని ఎవరు ఎన్ని విధాల చిత్ర హింసలకు గురి చేస్తున్నారనేది ఏ కరవు పెడితే చాలా పెద్ద జాబితా అవుతుంది. ఏమతం ఏ విధంగా పిల్లల్ని దారుణంగా అణచివేస్తున్నదీ పెద్ద జాబితా లోకి వస్తుంది. సమితి, యీ విషయం జాగ్రత్తగా గ్రహించి, హక్కుల పత్రం తయారు చేసింది వీటిని ఆమోదించిన దేశాలు, తమ ప్రాంతంలో మతాల్ని జాగ్రత్తగా అదుపులో పెట్టి, పిల్లల్ని కాపాడాలి.

పుట్టిన పిల్లలందరూ పెరుగుతారు. ఎలా పెరుగుతున్నారనేది సమస్య. అక్కడే వారి హక్కుల ప్రస్తావన వస్తుంది ఇందుకుగాను తల్లిదండ్రులకు చాలా చెప్పవలసి వుంది. పిల్లలహక్కులు అనేది చాలా మందికి వింతగా, కొత్తగా, ఆశ్చర్యంగా కనిపించవచ్చు. క్రమేణా, లోతుకు పోయే కొద్దీ అందులో శాస్త్రీయ సత్యం వుందని గ్రహిస్తారు. కొట్టి నోరు మూయించడం సులభం, నచ్చ జెప్పడం, సందేహాలు తీర్చడం, ఓపెన్‌గా జవాబులివ్వడం, విసుక్కోకుండా సమాధానాలివ్వడం దుర్లభం.

ముఖ్యంగా పిల్లలకు అబద్ధాలు చెప్పకూడదు తల్లిదండ్రులు చాలా సందర్భాలలో, క్రమశిక్షణ పేరిట, భయం పుట్టించే విషయాలు చెబుతారు. దేవుడికి దండం పెట్టక పోతే శిక్షలు పడతాయనీ, నరకానికి పోతారనీ, చీకట్లో రాక్షసులు, దయ్యాలు, భూతాలు వస్తాయనీ యిలాంటి వన్నీ తాత్కాలికంగా తల్లిదండ్రులకు ఉపకరించవచ్చు కాని పిల్లలకు శాశ్వత హాని చేకూర్చుతాయి. దైవాన్ని గురించి పిల్లలు వేసే ప్రశ్నలకు చాలామంది తల్లి దండ్రులు తెలిసో తెలియకో ఆగ్రహిస్తారు, కొడతారు అదే వారు చేస్తున్న పెద్ద తప్పు. అలాగే పిల్లలు తమ పుట్టుక గురించి అడిగినప్పుడు కూడా దేవుడు పుట్టించాడనీ, చనిపోయినప్పుడు దేవుడు దగ్గరకు వెళ్ళారనీ చెప్పి, అన్వేషణ చంపేస్తున్నారు. తల్లి దండ్రులకు యీ విషయమై చాలా చెప్పవలసివుంది అక్కడే పిల్లల హక్కుల సమస్య వస్తుంది. ఇది ఒక విధంగా చిక్కులతో కూడిన దైనా, తప్పనిసరిగా పరిష్కరించాలి

పిల్లల హక్కులు గమనించనందున అనేక దారుణాలు జరిగిపోతున్నాయి. ప్రతి సంవత్సరం, సమితి అంచనా ప్రకారం ఒక కోటి ఇరవై ఐదు లక్షల మంది పిల్లలు చనిపోతున్నారు. ఇందులో కనీసం 24 లక్షల మంది పిల్లల్ని రోగాలనుండి కాపాడడం సాధ్యమైనా, అశ్రద్ధ, అనాగరికత, అజ్ఞానం, అందుబాటులో వైద్యం లేక హత మౌతున్నారు 40 లక్షల మంది పిల్లలకు శుభ్రమైన నీరుతాగే అవకాశం లేకుండా వెనుకబడిన దేశాలలో పెరుగుతున్నారు. ఆసియా దేశాలలో ఆరున్నర లక్షల మంది పిల్లలు వ్యభిచార వృత్తిలో వున్నట్లు అధికార లెక్కలు చూపుతున్నాయంటే, యీ సమస్య యింకెంత తీవ్రంగా

వుందో గ్రహించవచ్చు. పెద్ద వాళ్ళ ఎయిడ్స్ వ్యాధులవలన, సెక్స్ అశ్రద్ధవలన చిన్న పిల్లలకు అవి సోకి హతమారుతున్నారు. 20 లక్షల మంది ఆడపిల్లల్ని సాలీనా ''సుంతీ'' ఘోరకృత్యానికిగురి చేస్తున్నారు. గత దశాబ్దంలో వివిధ యుద్ధాలలో చిన్న పిల్లల్ని వినియోగించి 20 లక్షల మందిని హతమార్చారు. 50 లక్షల మంది వికలాంగులుగా మారారు కోటిమంది నిరాశ్రయులయ్యారు మందుపాతర్లవలన నిరంతరం పిల్లలు దారుణంగా బాధలకు, చావులకు గురౌతున్నారు.

ఈ విషయాలన్నీ ప్రపంచమతాల సభలు గుర్తించాయి. పైగా వీటిని అరికడతామని అంటున్నాయి 1990లో ప్రిన్స్‌టన్ (అమెరికాలో) ప్రపంచ మత ప్రతినిధులు సమావేశమై పిల్లల హక్కుల్ని వెంటనే గుర్తించి అమలు పరచాలన్నారు. 1996లో మళ్ళీ యీ మత సంస్థలు తీర్మానాలు చేశాయి. 1993లో చికాగో నగరంలో 5 వేల మంది మత ప్రతినిధులు సమావేశమై చిన్న పిల్లల సంరక్షణ తక్షణ అవసరంగా పేర్కొన్నారు. దొంగస్వయంగా ముందు కొచ్చి, ''దొంగ, దొంగ'' అని అరచి, తప్పించుకున్నట్లుగా, మతాలు ముందు కొచ్చి, చిన్న పిల్లల హక్కుల గురించి మొసలికన్నీరు కారుస్తున్నాయి. మతాలు చేస్తున్న ఘోరకృత్యాలు, మత గ్రంధాలలో పిల్లలకు వ్యతిరేకంగా వున్న దారుణాలు, మతాల పేరిట జరుగుతున్న చిన్న పిల్లల అత్యాచారాలు ఖండించ లేక పోతున్నారు.

మానవ హక్కులు కావాలని పోప్ అనడం ఎంత అపహాస్యమో, పిల్లల హక్కుల్ని గురించి మతాలు మాట్లాడడం అంతే

పిల్లల హక్కుల గురించి బాగా ప్రచారం జరగాలి. ఇది మతేతరంగా సాగడం అవసరం.

యునిసెఫ్ సంస్థ పిల్లల హక్కుల కోసం చేస్తున్న కృషిని స్వచ్ఛంద సంస్థలు చేపట్టవచ్చు. టి. వి., రేడియో, పత్రికలు, మానవ హక్కుల సంఘాలు ప్రధాన పాత్ర వహించవచ్చు. తగిన సమాచారం కోసం:

UNICEF
United Nations Childrens Fund
333 East 38th St. New York 100016
Phone 212 686 5522
Fax 212 779 1679 కు రాసి తెప్పించుకోవచ్చు.

యూరోప్‌లో పిల్లల హక్కుల విషయమై పని చేస్తున్న స్వచ్ఛంద సంస్థ.

RADDA BARNEN
SE-10788 STOCKHOLM
Phone · 468698 9000

పిల్లల హక్కుల గురించి శిక్షణయిచ్చే ఒక కిట్‌కూడా యీ సంస్థ తయారు చేసింది The UN Convention on the Rights of the Child Training Kit

460 పేజీలతో గూడిన యీ Kit శిక్షణ యివ్వదలచిన వారికి చాలా ఉపయోగకరం

వివిధ క్రైస్తవ మతశాఖలు మతం పేరిట పిల్లల్ని ఎలా చిత్రహింసకు గురి చేస్తున్నదీ పరిశోధించి, వారిని కాపాడే పోరాటంలో నిమగ్నమైన సంస్థ:

CHILD, INC.

Box 2604

Sloux City, IA 51106 USA

Phone 712 948 3500

రీటా స్వానే అనే ఆమె యీ సంస్థకు సారథ్యం వహిస్తున్నారు

ప్రాథమిక పాఠశాలస్థాయి నుండీ పిల్లల హక్కుల గురించిన వివరాలు ఆకర్షణీయంగా రాసి పాఠలుగా అందించాలి. ఉపాధ్యాయులు యీ హక్కుల పత్రాన్ని బాగా అధ్యయనం చేయాలి. టి.వి లో చక్కని ప్రదర్శనలు డాక్యుమెంటరీల ద్వారా విపరీత ప్రసారాలు రావాలి.

మానవ హక్కులలో భాగంగా పిల్లల హక్కులకు ప్రాధాన్యత వుందని గుర్తించాలి.

పిల్లలకు చెప్పవలసిన విషయాలలో సున్నితమైన పుట్టుక, పెరుగుదల గురించి ప్రామిథస్ ప్రచురణ సంస్థ అమెరికాలో శాస్త్రీయ రచనలు వెలువరించింది.

లైంగికంగా చిన్న పిల్లలు వివిధ చిత్రహింసలకు గురైనప్పుడు వారిని ఎలా జాగ్రత్తగా చూడవలసిందీ పరిశోధన జరుగుతున్నది. వివారలకు:

Center for Children's Support
Specialty Care Center
42 East Laurel Road
Suite 1100
Stratford, NJ 08084
USA

మన దేశంలో యీ విషయమై కప్పిపుచ్చడం చాలా ఎక్కువ. సమాజంలో యీ దురాచారాన్ని అరికట్టకపోతే పిల్లల భవిష్యత్తు బాగా దెబ్బతింటుంది. మనకు చాలా కాలంగా, గురుకులాలలో వున్న సెక్స్ దురాచారాలు, వివిధ రుపాలలో పాంచివుంది. దీనిని కూడా ఎదుర్కోవాలి.

పిల్లల హక్కుల విషయం 21వ శతాబ్దిలో అత్యంత ప్రాధాన్యత వహించేదిగా పరిణమించనున్నది. తల్లిదండ్రులకు యిది షాక్ ట్రీట్‌మెంట్. మతాలకు పునాదులు కదిల్చే పరిస్థితి.

# ఆమ్లవర్షాలు

– డా: చాగంటి కృష్ణకుమారి

'వానల్లు కురవాలి.

వరిచేలు పండాలి

మా అమ్మ వండాలి

మా బొజ్జ నిండాలి' –

తల్లులంతా పిల్లలకి కడుపునిండా అన్నం పెట్టాలంటే వానలు కురవాలి.

ప్రకృతి ప్రసాదించిన వరాల్లో కెల్లా గొప్పవరం వర్షం.

ప్రబంధ కవులు వర్ష ఋతువును వర్ణించారు.

పృథివీ ప్రాంగణాలకి పచ్చశాలువాలనిమ్మని అడుగుతూ

ఆషాడలక్ష్మిని ఆహ్వానించారు అబ్బూరివారు.

వాన అమూల్యమైనది. అందుకే అది వానదేముడయింది.

మనిషిచేత పూజలందు కొంటున్న వానలు అతనికి ఏమి వరాలిస్తున్నాయ్?

గ్రీష్మంలో కురిసే వానలు సేద తీరుస్తాయ్.

వసంతంలో వానలు జలస్తరాలని మళ్లీ నీళ్లతో నింపుతూ

భూజలాలని పరిశుభ్ర పరుస్తాయ్.

శారదంలో పడే వానలు గాలిని శుభ్రపరుస్తాయ్.

హేమంతంలోకురిసే మంచు ఆకాశాన్ని నిర్మలంగా ఉంచుతూ ఆహ్లాదాన్నిస్తుంది.

సకాలంలో సజావుగా కురిసే వానలు మనిషికి ఆశను పుట్టిస్తాయ్

అతని భవిష్యత్తు సుఖంగా, ఆనందంగా, ఫలప్రదంగా గడుస్తుంది

లెమ్మని వాగ్దానం చేస్తాయ్.

ప్రతీ ఏడూ వర్షాలు ఒక్కలాగే ఉండవు.

వర్ష స్వభావం అతి చెంచలం.

ఒకోసారి అతి వృష్టి ఉంటుంది; మరో సమయంలో అనావృష్టి ఉంటుంది.

ఈ మధ్యకాలంలో వరదలూ, వెల్లువలూ, ఉప్పెనలూ, ఉగ్రమైన గాలి వానలూ ఎక్కువయ్యాయ్. అవి తరచుగా వస్తున్నాయ్. మనిషి నాగరికుడయ్యాడు. ఆధునిక జీవితం కొనసాగిస్తూ ప్రకృతిలో ఎక్కువగా జోక్యం కల్పించుకొంటున్నాడు. పరిశ్రమల నుండి హరిత గృహ వాయువులు (కార్బన్‌డయాక్సైడ్ $CO_2$, నైట్రొజన్ ఆక్సైడ్‌లు $No_4$, క్లోరో ఫ్లోరో

కార్బనలు CFC, మీథేన్ $CH_4$, నీటి ఆవిరి $H_2O$(వా)లు) గాలిలో కలుస్తూ భూమిపై వికిరణ సమతూకాన్ని దెబ్బతీస్తున్నాయ్. భూమి వేడెక్కి పోతోంది. అందుకే ఈ ప్రకృతి వైపరీత్యాలు.

వానలు ఎప్పుడు కురవాలో అప్పుడే కురవాలి. వర్షపాతం ఎంత ఉండాలో అంతే ఉండాలి వాన నీరు నాణ్యమైనదే అయి ఉండాలి. వాన నీటి నాణ్యత అంటే ఏమిటి? మీరు ఎప్పుడైనా వాన నీరు తాగి రుచి చూసేరా? తొలకరిలో తొలి చినకుల సంగీతాన్ని వింటూ వాటిని రుచి చూడకుండానే ఉన్నారా? మనం తాగే నీరు రుచిగా ఉండాలను కొంటాం. ''నీళ్లు ఉప్పగా ఉన్నాయ్ దాహం తీరలేదు'' – అనో, నీళ్లు చల్లగా, కమ్మగా ఉన్నాయ్; హమ్మయ్య! గ్లాసుడు నీళ్లు తాగేసరికి ప్రాణం లేచొచ్చింది'' అనో అనుకొంటూ ఉంటామ్. రోజూ మనం తాగేనీరు పుల్లగా నిమ్మరంసలా ఉందనుకోండి. (నిమ్మకాయ షర్బత్తుకాదు; నాలిక మీద నిమ్మరసాన్ని ఓ చెంచాడు వేసుకొని చూడాలి) అప్పుడు మన దాహం సంగతేమిటి? మన ఆరోగ్య పరిస్థితి మాట ఏమిటి? వాతావరణంలో ప్రకృతి సిద్ధంగా కార్బన్ డయాక్సైడ్ వాయువు ఉంది. ఇది సులభంగా నీటిలో కరుగుతుంది. ఈ వాయువు కరిగి ఉన్న నీరు స్వల్పమైన ఆమ్లగుణంతో ఉంటుంది. ★ ఈ ఆమ్లాన్ని కార్బొనిక్ ఆమ్లం అంటారు. వర్షపునీటి pH విలువ 5.6 నుండి 5.7 వరకూ ఉంటుంది. ఈ విలువ భూమిలోని ఖనిజాలు నీటిలో కరగడానికి అనువైన విలువ. ఖనిజాలు నీటిలో కరగడం వల్ల అవి జీవరాశులకు అందుబాటులోకి వస్తాయ్. జీవరాశులు ఆరోగ్యంగా ఉండటానికి దోహద పడతాయ్.

అడపా తడపా వర్షపు నీటి pH విలువలో స్వల్పమైన మార్పు వస్తూ ఉంటుంది. ప్రకృతిలో అగ్నిపర్వతాలు బద్దలవడం, అరణ్యాలు అంటుకోవడం వంటి ఒడిదుడుకుల వల్ల వాతావరణంలో ఆమ్ల ఆక్సైడ్‌లు చేరి వాన నీటి ఆమ్లగుణాన్ని స్వల్పంగా పెంచుతాయ్. అయినప్పటికీ ప్రకృతి తన సమతూకాన్ని తాను కాపాడు కొంటూనే ఉంటుంది. జీవరాశులకు హాని కలగకుండా లేదా స్వల్పమైన హాని మాత్రమే కలిగే విధంగా సర్దుబాట్లు చేస్తూ ఉంటుంది. అంచేత ప్రకృతి ఎప్పుడు సహజమైన నీటినే (అంటే pH 5.6 నుండి 5.7 వరకూ గల వర్షపునీరు) వర్షంగా కురిపిస్తుంది.

---

★ భూ ఉపరితల జలాలు వేసవిలో ఎక్కువగా ఆవిరై వాతావరణపు పైభాగాలకు చేరి అక్కడ చల్లబడి మేఘాలేర్పడతాయ్. వర్షాకాలంలో ఇవి వాన నీటిగా భూమిని చేరుకుంటాయ్ మేఘాల నుండి నీటి బిందువులుగా ఏర్పడిన నీరు స్వచ్ఛమైనది ఈ నీటి pH విలువ 7.0 అంటే అది ఆమ్లంకాదు, క్షారంకాదు. కానీ ఈ నీటి బిందువులు వాతావరణపు పొరల గుండా భూమి వైపు ప్రయాణించినపుడు గాలిలో ఉన్న కొన్ని ఆమ్ల స్వభావం ఉన్న ఆక్సైడులు ఆ నీటిలో కరుగుతాయ్ ముఖ్యంగా కార్బన్ డయాక్సైడ్ కరుగుతుంది. ఫలితంగా pH తగ్గుతుంది. ఆమ్లత్వం పెరుగుతుంది.




పై చర్యవల్ల నీటి pH 7.0 నుండి 5 6కి తగ్గుతుంది ఒక పదార్థం ఆమ్లగుణంతో ఉందా? లేదా క్షార గుణంతో ఉందా? అని తెలుసుకోడానికి వాడే సూచిక ఆమ్లతారకం (pH) దీనిని శాస్త్రీయంగా $pH = -\log [H^+]$ గా తెలియ జేస్తారు ఈ సమీకరణంలోని $[H^+]$ హైడ్రోజన్ అయన్ గాఢతను సూచిస్తుంది pH విలువ 7 కంటే తక్కువగా ఉంటే ఆమ్లంగానూ, 7 కంటే ఎక్కువగా ఉంటే క్షారంగాను గుర్తిస్తారు 7 0 ఉంటే తటస్థంగా గుర్తిస్తారు నిమ్మరసం pH=2.2; వినేగార్ pH=3 0, ఆపిల్ pH=3 2, టమోటా pH = 4 2

కానీ కొన్ని దశాబ్దాల నుండీ వర్షాలు '' ఆమ్ల వర్షాలై'' కురుస్తున్నాయ్. # పరిసర శాస్త్రజ్ఞులను వానజల్లులు ఆమ్ల జల్లులై జడిపిస్తున్నాయ్. అవి వారికి ఈనాడు ప్రధానమైన సమస్య అయి కూర్చున్నాయ్. బాధ్యత ఎరిగిన శాస్త్రజ్ఞులందరూ కలవర పడుతున్నారు. నివారణోపాయాలను రూపు దిద్దడానికై శ్రమిస్తున్నారు. ఈ పరిస్థితికి కారణం ఏమిటి? శాస్త్రజ్ఞులు ఈ విషయంలో ఎందుకు ఆందోళన పడుతున్నారు?

పారిశ్రామీకరణంతో, నాగరికతా పెరుగుదలతో ఉష్ణవిద్యుత్ ఉత్పాదక కేంద్రాలు, పరిశ్రమలు, ఫౌండరీలు, ఎక్కువయ్యాయ్. అవి రోజుకి కొన్ని వేల టన్నుల నైట్రొజన్ ఆక్సైడ్‌లనీ, సల్ఫర్ ఆక్సైడ్‌నీ గాలిలోకి విడుదల చేస్తున్నాయ్. ఇవి వాతావరణంలో కాంతి రసాయన చర్యలలో, ఉత్ప్రేరక చర్యలలో పాల్గొని ఆమ్లాలుగా మారిపోతున్నాయ్. ఈ ఆమ్లాలు వాతావరణంలోని తేమతో కలసి వర్షపు నీటి చుక్కలుగా అవక్షేపితాలవుతున్నాయ్. నైట్రిక్ ఆమ్లం, సల్ఫ్యూరిక్ ఆమ్లం నీటిలో కరిగి ఆమ్ల వర్షాలై కురుస్తున్నాయ్.

ఆమ్ల వర్షాల నీటి pH విలువ పడిపోతుంది. నదులు, సరస్సులు, తటాకాలు, వాగులు, ఏరులు, సెలయేరులు నీటి కాలుష్యానికి గురి అవుతున్నాయ్. ఆమ్ల వర్షాల వల్ల భూసారం తగ్గుతుంది. మొక్కలకు కావలసిన పొటాషియం వంటి పోషక పదార్థాలు మట్టి నుండి నిక్షాళనం అయి పోతాయ్. రైతన్నకు స్నేహితులైన వానపాములు చచ్చిపోతాయ్. నీటికి అధిక ఆమ్లగుణం ఉంటే విత్తనాలు మొలకెత్తవు. మొక్కలు పెరగవు. చేపలలో పునరుత్పత్తి శక్తి తగ్గుతుంది. వాటి పెరుగుదల క్షీణిస్తుంది. అధిక ఆమ్లగుణం ఉన్న నీటిలో చేపలగుడ్లు పొదగబడటానికి అనుకూలత ఉండదు. చేపల సంతతి నశిస్తుంది. సాల్మన్ (Solmon), ట్రవుట్ (Trout) చేప జాతులు విలుప్తమయి పోవడానికి ఆమ్ల వర్షాలే కారణమని శాస్త్రజ్ఞులు రుఢీగా చెపుతున్నారు.

జలజీవ వ్యవస్థకు ముఖ్యంగా అవసరమైన ఆకుపచ్చని ఆల్గే సూక్ష్మ జీవులు పూర్తిగా చచ్చి పోతాయ్. అటువంటి నీటిలో సేంద్రియ పదార్థాలు విఘటనం చెందవు. అవి నీటిలో చేరి మార్పు చెందకుండా అలాగే ఉండి పోవటం వల్ల నీరు కలుషితమవుతుంది. స్వతః సిద్ధంగా నీరు పరిశుద్ధమవుతూ ఉండటం అనే ప్రకృతి లక్షణం ఈ విధంగా ప్రభావితమవుతుంది. తటాకాలు, నదులు మొదలైన వాటిలో నీటి ఆమ్లత్వంలో మార్పు లేకుండా ఎక్కువకాలం అధికంగానే ఉండిపోతే, నేలలో ఉన్న సీసం, కాడ్మియం, రాగి, జింక్, క్రోమియం, మాంగనీసు వంటి లోహాలు అయానులుగా విడుదలై నీటిని కలుషితం చేస్తాయ్. ఈ కాలుష్యం వృక్ష, జంతు, మానవ జాతులపై దుష్పరిమాణాలకు దారి తీస్తుంది. మనిషికి విరేచనాలు, క్షయ, టైఫాయిడ్, కలరా, కామెర్లు వంటి వ్యాధులు వస్తాయి. అడవులు నశిస్తాయ్ – నేలలోని సూక్ష్మ జీవులు, వానపాములు నశిస్తాయ్.

# ఆమ్ల వర్షం అంటే అధిక ఆమ్లత్వం కలిగి ఉన్న వర్షం కురవడం అని అర్థం.

ఆమ్ల వర్షాల వల్ల గృహాలు, విగ్రహాలు, ప్రతిమలూ, వంతెనలూ, కంచెలు, కమ్మీలు గుంటలు వారిపోతాయ్. సున్నపురాతి కట్టడాలను, చలువ రాతి మేడలను ఆమ్లం తినేస్తుంది. పెద్ద పెద్ద గోడలు పగిలిపోయి కట్టడాలు కూలిపోతాయ్. దీనిని ''రాతి కొరుకుడు పుండు రోగం'', లేదా ''రాతి కుష్టు రోగం'' (Stone lepracy) అంటారు. అంటే భవనాలు, భవంతులూ కుష్టు రోగంతో కుప్పకూలి పోతాయ్ అన్నమాట.

ఆమ్ల వర్షాలు ఎప్పుడెప్పుడు ఎక్కడెక్కడ కురిసాయో వాటి దుష్ప్రభావం ఎలా ఉందో తెలుసుకొందాం.

1958 లో యూరప్‌లో కురిసిన వాన pH విలువ 5.0 ఉంది. 1962లో నెదర్లాండ్స్, స్వీడన్‌లలో pH 4.5 ఉన్న ఆమ్ల వర్షం పడింది. అప్పుడు స్వీడన్‌లో ఉన్న అడవులన్నీ దెబ్బతిన్నాయ్. 20,000 మడుగులలోనూ, సరస్సులలోను నీటి pH విలువ బాగా తగ్గిపోయి వృక్ష, జంతు జీవాలు చచ్చి పోయాయ్. 1979 లో USA లో 4.2 pH విలువ ఉన్న వాన కురిసింది. లాస్ ఏంజిల్స్ లో కురిసిన దట్టమైన మంచు pH విలువుగా నమోదు అయింది. USA లో పడమటి వర్జీనియాలోని వీలింగ్ లోనూ, స్కాట్‌లాండ్ లోని పిట్‌కొరి లోను వాననీటి pH విలువ 2.2 కన్నా కూడా తగ్గిపోయింది. ఈ pH విలువ నిమ్మరసం pH విలువ కంటే కూడా తక్కువే! అంటే ఆ వర్షపు నీటి ఆమ్లత్వం ఏపాటిదో అర్థం చేసుకోవచ్చు. ఆ వర్షపు నీటి ఆమ్లగాఢత ఒక విద్యుత్ ఘటంలో ఉపయోగించే ఆమ్ల గాఢతకు సరి సమానంగా ఉంది. 1984 ఏప్రియల్ 10వ తేదీన Pitlochry లో వర్షం పడింది. ఆ వర్షపు నీటి ఆమ్లత్వం సాధారణ నీటి ఆమ్లత్వానికి ఒక లక్షరెట్లు ఎక్కువగా ఉంది. అటువంటి వాన నీటి దుష్ప్రభావం ఏపాటిదో ఇహ వేరే చెప్పేందుకు ఏముంటుంది?

అయితే ఆమ్లవర్ష దుష్ప్రభావం ఏమేరకు ఉంటుంది అనే అంశం, ఆమ్లవర్షం కురిసిన ఆ ప్రాంతపు వృక్ష, జంతు, జీవాలను బట్టి, స్థలాకృతిని బట్టి, అక్కడి శీతోష్ణస్థితి. భౌగోళిక తీరు తెన్నుల బట్టి అక్కడ జరిగే మానవ కార్యకలాపాలను బట్టి నిర్ధారితమౌతుంది. గాలి వాటాన్ని బట్టి కూడా ఉంటుంది.

స్వీడన్‌లో కురిసే ఆమ్లవర్షాలకు యు.కె. జర్మనీల నుంచి గాలిలో ప్రయాణమై అక్కడదాకా వచ్చి చేరుతున్న వాయుకాలుష్యాలు కారణమవుతున్నాయ్. మిడ్‌వెస్ట్‌లోని పారిశ్రామిక విభాగం నుండి వెలువడుతున్న గాలి కాలుష్యాలు ముఖ్యంగా సల్ఫర్ ఆక్సైడ్‌లు, న్యూయార్క్ లోని అడిరాన్ డాక్ దగ్గర ఆమ్ల వర్షాలు కురవడానికి కారణమవుతున్నాయ్. ఈ వర్షాలు అడిరాన్ డాక్ దగ్గర ఉన్న మడుగులను కలుషితం చేస్తున్నాయ్. అక్కడి భూసారాన్ని దెబ్బ తీస్తున్నాయ్. న్యూయార్క్ గాలిలో 87 శాతం గంధక కాలుష్యాలు, న్యూజెర్సీ గాలిలోని 92 శాతం గంధక కాలుష్యాలు, సుదూర ప్రాంతమైన పశ్చిమ మాధ్యమం నుండి ప్రయాణమై వస్తున్నవే.

పశ్చిమ జర్మనీలోని కోటలు, చర్చీలు, ఏథెన్సులోని పురాతన గ్రీకు దేవాలయాలు వెనిస్ నగరంలోని రమణీయమైన భవనాలు పారిశ్రామిక యుగానికి పూర్వము శతాబ్దాల తరబడి చెక్కు చెదరకుండా నిలిచే ఉన్నా కిందటి 30, 40 సంవత్సరాల కాలంలో మరమత్తులకు వీలు కానంతగా చెడిపోయాయ్. గ్రీకులోను, ఇటలీలోను అత్యంత అమూల్యమైన చారిత్రాత్మక విలువగల రాతి విగ్రహాలు ఆమ్లవర్షాల కారణంగా కరిగి పోయాయ్. భారత దేశంలో ఢిల్లీ, బొంబాయి, కలకత్తా, మద్రాసు నగర ప్రాంతాలలో ఆమ్ల వర్షాలు కురిసినట్టుగా గుర్తించారు. తాజ్‌మహల్ పరిస్థితి యావత్ భారత దేశాన్నీ సంక్షోభపరుస్తోంది. శిలా కట్టడాల మీద కురిసే ఆమ్ల వర్షాల తాకిడి ఎంత క్లిష్టమైనదీ, కీలకమైనదీ అంటే, దాని విచ్ఛేదనం ఒకసారి ప్రారంభం కాగానే ఇంక ఆ క్రియకు తిరుగులేదు, సరికదా, గుణశ్రేణిలో సాగుతుంది.

ఆమ్ల వర్షాలు మనిషి ఆరోగ్యాన్ని పాడుచేస్తాయ్. ఊపిరితిత్తులకు, చర్మానికీ, జుత్తుకూ అధిక ఆమ్ల గుణం ఉన్న నీరు హాని చేస్తుంది. ఇటువంటి నీటిలో బరువైన లోహాలు కరిగి, మనిషి ఆరోగ్యానికి చెరుపు చేస్తాయ్

ఆమ్ల వర్షాలు ఎప్పుడు, ఎక్కడ పడ్డాయి అనీ, ఎక్కడ పడుతున్నయనీ, లేదా అవి ఎక్కడ పడే అవకాశాలు ఉన్నాయనీ, వాటి దుష్ప్రభావాలు ఎలా ఉండవచ్చునని, వాటిని ఎలా అంచనా వేయాలి – ఇవన్నీ తెలుసుకొన్నంత మాత్రాన ప్రయోజనం లేదు. ఆమ్లవర్షాలు ఇకపై పడకుండా జాగ్రత్తలు తీసుకోవటం సమంజసం.

ప్రపంచ దేశాలలో అందరి దృష్టినీ ''ఆమ్ల వర్షాలు'' అనే అంశంపై ముఖ్యంగా స్కాండెనేవియాలోనూ, కెనడాలోను కురిసిన ఆమ్ల వర్షాలపై అందరి దృష్టినీ కేంద్రీకరింప జేయాలనే ఉద్దేశంతో 1982, జూలై మాసంలో స్టాక్ హోమ్‌లో ''ఆమ్లవర్షాలు'' అనే అంశంపై అంతర్జాతీయ సదస్సును ఏర్పాటు చేశారు. అందులో 33 దేశాలు పాల్గొన్నాయ్. ఈ విషయాన్ని నిశితంగా చర్చిస్తూ ఉండగానే ''నేను ఆమ్ల జలాన్ని; వర్షిస్తున్నాను; నా గురించి ఏమి నిర్ణయాలు తీసుకొన్నారు? ఏం చేయ బోతున్నారు?'' అని ప్రశ్నిస్తూ కుంభవృష్టిగా ఆమ్లవర్షం కురిసింది. సదస్సు వారం రోజులు జరిగితే ఆ వారం రోజులూ కురుస్తూనే ఉంది. గంధకం అవక్షేపితమవటానికి సురక్షిత విలువ, ఒక సంవత్సర కాలానికి, ఒక చదరపు మీటరుకీ అరగ్రాము అయితే, సదస్సు జరిగినప్పుడు కురిసిన వర్షం వల్ల అవక్షేపితమైన గంధకం యొక్క విలువ 3.5 గ్రాములు ఉంది.

అధునాతన జీవన విధానాలు ఆమ్ల జల్లులై మనిషిని కొరుకుకు తింటున్నాయ్.

వాయు కాలుష్య నివారణా పద్ధతులను కఠినంగా అమలు పరిస్తే, వరుణుడు హర్షించి అందరికీ అనుకూలంగా వర్షిస్తాడు.

# పుస్తకం పుట్టుక

– జానమద్ది హనుమచ్ఛాస్త్రి

వ్రాతకు సంబంధించిన పదముల మూలం, ఋషిమూలం అన్వేషణ వలె అంతు తేలకుండా వుంది. మన చదువుల తల్లి సరస్వతీదేవి వీణా, పుస్తక పాణిగా స్తుతింపబడుతున్నది. పుస్తకం వాస్తవంగా భారతీయ పదంగా వుండాలి. కాని ప్రాచీన ప్రయోగంగా, భారతీయ సాహిత్యంలో కానరాదు. పాణినీయ వ్యాకరణంలో ఈ పదం కనిపించదు. కాని 'పుస్త' బుస్త అనుధాతువులున్నాయి. కాని అవి 'పుస్తక' మునకు సంబంధించినవి కావు. హరివంశ పురాణంలో పుస్తక పదం వున్నట్లు మోనియర్ విలియమ్స్ కూర్చిన సంస్కృత నిఘంటువు పేర్కొన్నది. కాని హరివంశపురాణం అత్యంత ప్రాచీనమైనది కాదని విజ్ఞుల అభిప్రాయం. వరాహమిహిరుడు పుస్తకాన్ని గురించిన ప్రస్తావన చేసినందున క్రీ.శ. 5వ శతాబ్దంలో పుస్తకం ప్రచారంలో వున్నదని కచ్చితంగా చెప్పవచ్చు. అమరకోశంలో 'పుస్తకం' కానరాదు. బాణభట్టు రచించిన 'హర్షచరిత్ర' లోను, ఆ తర్వాతి కావ్యాలలోను ఈ పదం గోచరమగుచున్నది.

'పుస్తక' పదం ప్రాచీన పారసీక పదం నుండి మనకు సంక్రమించింది. 'తుర్కీ' భాషనుండి ఆపదం వచ్చిందని డా॥ సునీత కుమార్ ఛటర్జి పేర్కొన్నారు. 'ఇరాన్' దేశంలో శాశ్వతంగా భద్రపరచదగిన పత్రాలను వ్రాసేందుకు ఉపయోగించే పదును చేసిన గొర్రె చర్మాన్ని 'పోస్త' అనేవారు ( ఇంగ్లీష్‌లో పార్చ్‌మెంట్) 'పోస్త' ప్రాకృత భాషలో ప్రవేశించి గుజరాతి, హిందీ మున్నగు భాషల్లో 'పోథా' 'పోథీ' మొదలగు రూపాలు ధరించింది. 'పోథీ ' జమాఖర్చుల చిట్టాగా అన్వయింపబడింది.

'కాగితం' వాడుకకు ముందు భారతదేశంలో వ్రాతకు తాళపత్రాలు, లేదా భూర్జ (భోజ) పత్రాలు ఉపయోగించేవారు. తాళపత్రాలు తాటి చెట్టు ఆకులు. హిమాలయప్రాంతంలోని 'భూర్జవృక్షం' చెట్టు బెరడును వ్రాతకు ఉపయోగించేవారు. మనదేశంలో తూర్పు ప్రాంతాల్లోను, దక్షిణ భారతంలోను తాటి ఆకులపై 'గంటముల'తో వ్రాసేవారు. ప్రాచీన ఈజిప్టులోని 'పిపరస్' చెట్టు పల్చని బెరడును వ్రాతకు ఉపయోగించేవారు. గ్రీకు భాషకు చెందిన 'పిపరస్' ల్యాటిన్ ద్వారా, ఫ్రెంచ్ భాషాపరంగా, ఇంగ్లీష్‌లో చేరి పేపర్‌గా రూపందాల్చింది. ఈ పేపర్ ఈనాడు, వార్తాపత్రిక మొదలు, ప్రౌఢ ప్రబంధాల వరకు అన్వయింపబడి వ్యాప్తిలో వుంది.

పల్లెప్రజలకు కూడ పరిచయమైన 'బుక్' (ఇంగ్లీష్) యూరోప్‌కు చెందిన 'బీచ్' చెట్టునుంచి వచ్చింది. ప్రాచీన ఇంగ్లీష్‌లోని 'బోచ్', జర్మన్ భాషలోని 'బుక్' అన్నపేర్లు చెట్టుబెరడు ద్వారా వచ్చినవే.

కాగితం, కలం, అన్నపదాలు సంస్కృత భాషలో 9వ శతాబ్దంనుండి కానవస్తున్నాయి. ఈనాడు భారతీయ భాషలన్నిటిలో కాగితం వుంది. చిరిగిన బట్టల నుండి కాగితం తయారుచేయటాన్ని

(తరవాయి 256వ పేజిలో)

# వైజ్ఞానిక స్పృహలేని జాతి నిర్వీర్యమవుతుంది

– డా. దేవరాజు మహారాజు

భారత ప్రథమ ప్రధాని పండిత జవహర్‌లాల్ నెహ్రూ దేశాన్ని వైజ్ఞానికంగా ముందుకు నడిపారు. పారిశ్రామిక వైజ్ఞానిక రంగాలలో దేశం నిర్వహించాల్సిన పాత్రగురించి నిరంతరం హెచ్చరిస్తూ వచ్చారు. భారతీయ సంస్కృతిలోని గొప్పతనాన్ని కీర్తిస్తూనే మూఢ భక్తిని, మూఢాచారాల్ని నిరసించారు. దేవుడి పేరిట జరిగే దుబారా ఖర్చును ఆయన ఎప్పుడూ సమర్థించలేదు. పైగా తీవ్రంగా నిరసిస్తూ ఉండేవారు భూమి ఒక గ్రహమైతే మిగిలిన ఎనిమిది గ్రహాల్ని ప్రసన్నం చేసుకోవడానికి 'అష్టగ్రహ కూటమి' పూజల కోసం కొన్ని టన్నుల ధాన్యాన్ని, కొన్నిగ్యాలన్ల నెయ్యిని అగ్నికి ఆహుతి చెయ్యడం వాడుకలో ఉంది. దేశంలో ఆకలి చావులు నానాటికి పెరుగుతున్న క్రమంలో దైవ ప్రీతి కోసం ఇంతటి ఖర్చును సమాజం భరించాల్సిందేనా? అంటూ 1962లోనే ఆయన ఈ పూజా విధానాన్ని దుయ్యబట్టారు.

యాగాల పేరిట, యజ్ఞాల పేరిట జంతు బలులు ఇవ్వటం ఎంత నేరమో, సమాజానికి ఉపయోగపడే ధాన్యాన్నీ, నూనెల్ని, పాలని మానవుల ఉపయోగానికి పనికి రాకుండా వృథా చేయడం కూడా అంతే సమాజ ద్రోహం కదా? ఇలాంటి వాటిని నెహ్రూ ఎంతగా నిరసించారో.... ఆయన తర్వాత వచ్చిన వారు వాటిని అంతగా ప్రోత్సహిస్తూ వస్తున్నారు. మనం మతాల ప్రభావంలోంచి, మూఢ నమ్మకాల ప్రభావం లోంచి బయట పడనిదే ఒక కొత్త దిశలో ఆలోచించలేం. వ్యక్తులుగా మనం మారితేనే సంస్థలు మారుతాయి. సమాజం మారుతుంది. దేశం మారుతుంది. ప్రపంచం మారుతుంది. మూఢ నమ్మకాల నుంచి బయట పడడం కష్టమే కావచ్చు. కాని అసాధ్యం కాదు -

తిరుచూరు దగ్గరలో ఒక సంప్రదాయ నంబూద్రి గ్రామం తిరువతిరిలో వెయ్యి సంవత్సరాలుగా ఒక హోమగుండం కాలుతోంది. ఇందులో రోజుకు మూడుసార్లు తొమ్మిది రకాల ధాన్యాలు ఆహుతి చేస్తున్నారు. దానికి తగిన పాళ్లలో నెయ్యి, కొబ్బరి కూడా జత చేస్తున్నారు. వెయ్యేళ్ల నుంచి హోమం ఆరిపోకుండా ఉంచగలుగుతున్నారంటే, ప్రతి సంవత్సరం ఎంత ఖర్చు చేస్తున్నారన్నది ఎవరైనా లెక్క-గట్టొచ్చు. మూడు వందల అరవై అయిదు రోజులు ఇంత పెద్ద మొత్తంలో నవధాన్యాలు, నూనెలు, కొబ్బరి కాలిపోతున్నాయంటే ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఎంతమంది నోళ్ళు కొట్టబడుతున్నాయి?

అలాగే అభిషేక మహోత్సవం పేరిట కొన్నివేల లీటర్ల పాలు నదుల్లో కలుపు తున్నారు. ఇట్లా ఎందుకు చేస్తున్నారని ఎవరైనా అడిగితే వాళ్ళిచ్చే శాస్త్రీయ వివరణ ఏమంటే ''నదుల్లో పెరిగిపోతున్న జల కాలుష్యాన్ని తగ్గించడానికి, నీటిని శుద్ధి చేయడానికి!'' అని! 1989 డిసెంబర్27న శంకరా చార్య యోగపీఠ అధిపతి స్వామి భాస్కరానంద పరమహంస స్వయంగా దగ్గరుండి పూజలు చేస్తూ, వేద పఠనం గావిస్తూ, యమునా నదిలో సుమారు ఇరవై అయిదువేల లీటర్ల పాలను నీటిపాలు చేశారు. యమునా నదిలో కాలుష్యం తగ్గిందో లేక స్వామీజీకి దేవతలు ప్రసన్నులయ్యారో మనకు మాత్రం

తెలియదు. ఈ పుణ్య భూమిలో ఎంతటి మహత్కార్యాలు జరుగుతున్నాయో కదా అని మనం వెన్ను ఏరుచుకోవాలన్న మాట?

ఎవరైనా ధైర్యంగా 'దేవుడు' అనేది అసంగతం, అసందర్భం, అవాస్తవం ... మన నిత్య జీవితంలో ఏ శక్తి ప్రభావమూ లేదు. మానవ శక్తి ప్రభావం తప్ప-'' అని అంటే చాలామందికి భయం తన్నుకొస్తుంది. ''ఇవన్నీ మనకెందుకు? ఓ నమస్కారం పడేసి, హారతి కళ్ళకద్దుకుంటే సరిపాయె '' అని తమ పలాయిన వాదాన్ని ప్రవేశపెడతారు ఇలాంటి వారికి తమ గురించి తాము ఆలోచించుకోవడం తప్పించి, సమాజం గురించి గాని, దేశం గురించి గాని, కనీసం పక్కవాడి గురించి గాని, ఆలోచించడానికి ఒక క్షణకాలం తీరిక ఉండదు

భారత రాజ్యాంగంలో ప్రాథమిక హక్కుల గురించి ఉన్న వాక్యాలు చూడండి

''వైజ్ఞానిక ధోరణిని, మానవత్వాన్ని, సత్యాన్వేషణ తత్వాన్ని, సంస్కరణ వాదాన్ని పెంపొందింపజేయటం ప్రతి భారత పౌరుని కర్తవ్యం''.

ఈ భావానికి విస్తృతమైన ప్రచారం ఎందుకివ్వరు? తరాల అంతరం ఎలాగూ ఉంటుంది. కాని కొత్త తరం వారిని ఒక కొత్త దిశలో ఎందుకు ఆలోచించుకోనివ్వరు? అవే పాత పద్ధతులు, అవే ఛాందసాలు పిల్లల మీద, యువకుల మీద బలవంతంగా రుద్ది జాతి నెందుకు నిర్వీర్యం చేస్తారు? విజ్ఞులంతా కలిసి ఆలోచించాల్సిన అంశాలు ఎన్నో ఉన్నాయి.

(254వ పేజీ తరువాత)

చైనాదేశీయులు క్రీ.శ మొదటి శతాబ్దంలోనే ప్రారంభించారు. క్రమంగా అరబ్‌లు తుర్కీ ప్రజలు కాగితం తయారు చేయసాగారు. తుర్కీ భాషలోని 'కాగజ్' కాలక్రమంలో భారతదేశంలో 'కాగితం' అయింది. నేపాలి భాషలో 'కాయగత' అన్న చేతి వ్రాతపుస్తకముందని, అది 'కాగితం' రూపాంతరమేనని డా. సునీత కుమార్‌ఛటర్జీ అభిప్రాయం.

'కలమ్' అంటే లేఖిని. ఆపదం అరబిక్ భాషాపదమని ఉర్దు నిఘంటువులు పేర్కొన్నవి.

ఇక 'లిపి' (వ్రాత) పదాన్ని 'లిప్' (అతికించు) ధాతువు క్రింద వుంది. పాణినీయ సూత్రంలో, 'లిఖిత' అర్థంలో 'లిపి', 'లిబి' వస్తున్నాయి. ఈ, లిపి పదం కనీసం 2400 ఏళ్ళ చరిత్ర కల్గిందని. అశోకుని శాసనాల్లో 'లిపి' పదంతోపాటు 'దిపి' అన్న ప్రయోగం వుందని. ఇది ప్రాచీన పారసీక భాషాపదమని డా॥సునీత కుమార్ ఛటర్జి పేర్కొన్నారు.



**OIROT - Messenger of The White Burkhan - 1925**

